# పంచకల్యాణి

డాక్టర్ యస్వీ. జోగారావు, M.A., Ph.D.
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు - వాల్తేరు.

ప్రచురణ
ఆంధ్ర రచయితల సంఘం
హైదరాబాదు.

# భూమిక

ఆంధ్ర రచయితల సంఘం పక్షమున ప్రచురింపబడిన మూడవ గ్రంథ మీ 'పంచ కల్యాణి'. ఒకప్పుడు తెలంగాణము వరకే సీమితమైన ఈ రచయితల సంఘం ఆంధ్రప్రదేశ మవతరించిన పిమ్మట విస్తృతమైనసంస్థగా పరిణమించినది. ఉత్తరమున నున్న శ్రీకాకుళము నుండి దక్షిణమున నున్న చిత్తూరు మండలము వరకున్న ఆంధ్ర ప్రజానీకమునకు హైదరాబాదు రాజధానీనగరము విడిదిపట్టైనటులే ఆంధ్ర రచయితల సంఘం కూడ సమస్తాంధ్ర సాహితీ బంధుబృందమునకు కూడలి యైనది. ఈ 'పంచకల్యాణి' కృతికర్తలు శ్రీకాకుళమువారు; కృతిభర్తలు చిత్తూరు మండలమువారు. ఈ యిరువురికిని విడరాని బంధమేర్పడిన దీ హైదరాబాదు ఆంధ్ర రచయితల సంఘ వేదిపైన.

కవికిని, సహృదయునకును గల సంబంధము విజ్ఞు లెరుగనిది కాదు. గత సంవత్సర మొకనాడు విశాఖపట్టణమున జరిగిన కావ్యగోష్ఠిలో శ్రీ యస్వీ. జోగారావు గారు తమ 'అవతారము' నావిష్కరించినప్పుడు సదస్యు లందున్న రసికశేఖరులు శ్రీ రాజా బొప్పరాజు రామకృష్ణరాజు గారి మధుర హృదయము స్పందించినది. గోష్ఠి ముగియగనే రాజుగారు కవి నధికముగా నభినందించిరి. కవి హృదయ మందులకు కృతజ్ఞతానిర్భరమైనది. అప్పటి కంతియ. ఇటీవల ఏదో ఒక సందర్భమున నేను శ్రీ రామకృష్ణరాజుగారితో సంభాషించునప్పుడు శ్రీ జోగారావుగారి ప్రశంస వచ్చినది. సహృదయులగు రాజుగారికి వెంటనే పూర్వానుభూతి మరల కలిగినది. పరోక్షమున గూడ వారు శ్రీ జోగారావుగారి రచనా పాటవమును గూర్చియు, వారి శైలిని గూర్చియు మిక్కిలి ప్రశంసించిరి. ఈ వార్తను నేను శ్రీ జోగారావుగారికి ఎరుక చేసితిని. దానికి సమాధానము శ్రీ జోగారావుగారు తమ 'యవతారము' ను, దానితో పాటు వారి ఇతర ఖండకృతులను శ్రీ రామకృష్ణరాజుగారి కంకితమీయ సంకల్పించుట యైనది. సంగీతపోషకులైన కార్వేటి నగర రాజులకు సాహిత్యమందును సమానాదర ముండుట సహజము. ఒకటి యాపాత మధురమైన వేరొకటి యాలోచనామృతము. సర్వకలాకాంతులైన

రాజుగారు తాళవృత్త గతులతో సకలామోదకములగు సంగీత సాహిత్య విద్యా యుగళమున గురుప్రస్తార మొనర్చు చతురాననులు. కనుకనే శ్రీ జోగారావుగారి కృతి నందుకొనుటకు శ్రీ రామకృష్ణరాజుగా రుత్సుకులైరి. ఇరువురి యుత్సాహముల కాంధ్ర రచయితల సంఘం కేంద్రమై ఈ విజయదశమీ పుణ్యదినమున సాహితీ బంధువులకు సమారాధనము చేయుచున్నది.

శ్రీ యస్వీ. జోగారావుగారు ఆంధ్ర పరిశోధక ప్రపంచమున లబ్ధప్రతిష్ఠులు. సనాతనాధునాతన కవితాప్రక్రియలందు గడిదేరిన పిల్లవస్తాదు. కనుకనే

"అది ఘంటాపథ - మిది శృంగాటక
మెదిపడితె అది ఎకాయెకీ"

యని తమకు ప్రగాఢ ప్రత్యయముగల ప్రాచీన కవితామార్గమునను, ఆదరపాత్రమైన ఆధునిక కవితామార్గ చతుష్టమునను-వెరసి కల్యాణోదర్కములగు పంచవిధ కవితా మార్గములందును స్వేచ్ఛావిహార మొనరించినారు. కృతికి 'పంచకల్యాణి' యని నామకరణ మొనర్చినారు. మేలు కల్పపు పతాణియైన ఈ 'పంచకల్యాణి' శ్రీ రామకృష్ణరాజుగారికి చక్కనినజరాన. శ్రీ జోగారావుగారు మునుముందింకను చక్కని సాహిత్యమును సృష్టించి ఆంధ్రభారతి కమూల్య భూషణములు సవదరింపగలరు.

కృతికర్తలగు శ్రీ జోగారావుగారికిని, కృతిపతులైన శ్రీ రామకృష్ణరాజుగారికిని ఆంధ్ర రచయితల సంఘం పక్షమున కృతజ్ఞత లర్పించుచున్నాను.

మిత్రులు సుప్రసిద్ధ కళాకారులు శ్రీ మసిపదగ బలరామాచారిగారు ముఖపత్రము నుచితరీతిని శృంగారించినారు. వారికి నా నమోవాకములు.

ఇట్లు

డా. బి. రామరాజు, M.A., Ph.D.
ప్రధాన కార్యదర్శి
ఆంధ్ర రచయితల సంఘం

హైద్రాబాదు
శా. శ. ౧౮౮౦
విళంబి, విజయదశమి
22-10-1958

## కృతిపతి



శ్రీ రాజా వొప్పరాజు రామకృష్ణరాజుగారు, B.A., B.L., M.L.A.
ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు.

## కృతి సమర్పణము

*

తన దృష్టి తత సనాతన మహర్ష జ్ఞాన
ఘననిధానముల కంజనము గాగ
తన మనీష శిరీష తరుశిఖా సుమనస్సు
మున్మేష సుషమా సముజ్జ్వలముగ
తన వాక్కు నిత్య నూతన గీతి సాహితీ
రాస వాణికి రాణివాస మనగ
తన యూహ రమణీయ ధరణీ సమస్తైక
రామరాజ్య స్వప్న భూమికముగ
ప్రబలు నెవ్వ డాతడు బొప్ప రాజవంశ
కీర్తివర్త్మ కౌముది రామకృష్ణరాజు
రాజుగారికి తగు నజరాన యిద్ది
పంచకల్యాణి మంచి కబ్బపు పతాణి.

*

# పితృ ప్రశంస

★

నాయన నీ మనస్సు సుమ
నస్సుకుమారము నీదు వాక్కు ద్వై
పాయన సూక్తి ఫక్కికము ;
అమ్మ సరస్వతి సార్థకాహ్వ వా
గ్గేయ కృతి ప్రతీతి పరి
కలిత ; ఆమెయు నీవు నాకు రా
మాయణ భారతమ్ము లటు.
మాన్యులు సాంబశివాఖ్య సత్కవీ !

★

# విషయ సూచిక



★

# అవతారము

(ఊహాప్రహేళిక)

'ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.'

అది హిమాలయము కాదు మహిమాలయము.

అది పరమేష్ఠి చరాచర సృష్టి శిల్పకల్పనా పటిష్ఠతకు పరాకాష్ఠ.

అది పురాణదంపతులు జగత్పితరులు నగు పార్వతీ పరమేశ్వరుల చిరంతన పరంధామము. కామవాసనలు నశించిన వారి ప్రేమ కది పరసీమ.

శివదేవుని అభయహస్త శుభముద్రలచే ఆదిగర్భేశ్వరి యగు అపర్ణ తపఃఫలముగా సంభవించి శాంభవతేజము జగమఘాతుకముగా విజృంభించిన రంగభూమి.

భగీరథప్రయత్నమున దివినుండి దిగిన గంగాభవాని తరంగ తాండవ ప్రథమ భంగిమ కది యాధారపరిధి.

అది దేవతాత్మ.

పూర్వాపరసాగరాంతర పరివ్యాప్త మహీమండల మానదండము. సృష్టిలో నెల్ల స్వచ్ఛతకు, సౌందర్యమునకు, ఔన్నత్యమునకు, ఆధిక్యమునకు అనుత్తమోపమానము.

అది అనేక నదీమతల్లులకు పుట్టినిల్లు.

ఓషధుల నిధి.

రత్నముల నిక్షేపము.

అప్సరసల కాటపట్టు.

సిద్ధుల తపోనిష్ఠ కధిష్ఠానము.

గంధర్వుల గానవిద్యాసాధనకు నిదానము.

విరహవిధురహృదయులగు యక్షప్రేయసీప్రియుల రాయబారులకు మధ్యేమార్గప్రపాశాల.

★ ★ ★ ★

అట నవిముక్తమువలె నొక విశాల వివిక్తప్రదేశము.

అది యొక పచ్చని పర్వతోపత్యక. నలువంకల పంక్తులు తీరిన పర్వతములు - ఉత్తుంగశృంగములు - కైలాస, కాంచనగంగా, గౌరీశంకర, నందాదేవి, ధవళత్రిశూల శైలరాజములు.........ఆ పర్వత సానువులపై పరమేశ్వరు నొడలినుండి దిగజారు నాగులవలె నదులు, వాగులు. సాంద్రాతి సాంద్రమగు నొక భూరి కాంతారభూమి నావరించియున్న ఆగ్నేరిక ప్రాకారము నడుమ నదీజలముల బొదివిపట్టు మనోహరమైన మానససరోవరము.

అట ఆనా డెప్పటియట్ల ఉదయగిరి శృంగముపై ఉషః స్ఫురణ మైనది. కాని పరమేష్ఠి ప్రతిభ నవనవోన్మేషశాలిని. ఆ ప్రకృతి రామణీయకము నిత్య ప్రత్యగ్రము.

ఆనా డెందులకో ప్రకృతి భగవతి యుగపదుల్లాసము నవధరించినది.

పుడమి తల్లి పచ్చిపురిటాలివలె కడుపు చుమ్మలు చుట్టుకొన్నది. సరిత్తుల సరోవరముల సాగరముల జలదేవతలు రాసక్రీడ లాడుకొనిరి.

తొలినాటి చరమ సంధ్యావేళ అగ్నిభట్టారకు నంతరంగమునం దంతర్భవించిన రేపుమాపుల రూపురేఖలు దీర్చు కాంతిపుంజము నలవోక ఆకళించుకొని ఉదయభాస్కరు డువ్వెత్తుగా జగత్తు నొక క్రొత్తపోకడతో రకరకముల రంగురంగుల పోహణింపులతో హవణించినాడు.

అంతదాక శిశిర విశీర్ణములయ్యు హటాద్వసంత సంతోషముతో వింతగా చిగిర్చిన మ్రాకులపై, మ్రాకుల నాశ్రయించి కొనలుసాగి ననలెత్తిన క్రొందీవెలపై తావుల్ కొల్లగొనుచు వెదజల్లుచు చల్లనిగాలి రివటలు చక్కిలిగింతలుపెట్టుచు పోయినవి. ఆకస మకాల పర్జన్యగర్జా స్ఫూర్తి ప్రకటించినది.

ఆవేళ విధాత, అప్పటికే అనేక మూక జీవరాసుల జాతకము లేర్పరచిన నేర్పరి, ఒక్క అపూర్వాభినవ జీవపదార్థ సృష్టిసంకల్పము చేసి, అంతర్ముఖుడై యోగసమాధిలో నున్నాడు. సహధర్మచారిణి వాణి చేదోడువాదోడు కాగా ఆత్మసాక్షాత్కారము పొందిన మహాయోగివలె లేచి సంకల్పసిద్ధి పొందినా డతడు.

ఆనాడట పుడమితల్లి యొక క్రొత్తపురుడు పోసికొన్నది.

★ ★ ★ ★

అయ్యుషస్సుషమా సుభగమైన శుభసమయమున, ఆ ప్రాక్తన వ్యక్తి జీవన ప్రభాతవేళ అధోభాగము హిమావదాతమై ఉపరితల మరుణారుణ కుండలిత శిలామండలమై, శిఖరాంచలము సద్యోభ్యుదిత బాలభానుకిరణ కషణోజ్జ్వలమై హిమనిర్ఝరోపక్రమ రమణీయమై శశాంకశేఖరుని జటాజూటమువలె గన్పట్టుచున్నది గౌరీశిఖరము.

ఆ గిరిశేఖరముపై నది యొక విశాల శాద్వల తలము. చుట్టుపట్ల చెట్టుచేమలు నేలను నేసియున్నవి. పుడమి యొడలి పులకలవలె నవోద్భిదము లెడనెడ పొడసూపుచున్నవి.

అట నొకచో చీనాంశుకపు చికిలికుచ్చు విసనకర్రలవలె నున్న వాలము లెత్తి మేతలు మేయుచు, గాలికి వాలుగా వెనుక కాళ్ళపై నిలబడుచు గను మూయుచు పొత్తిళ్ళలో నొత్తుగా బెరిగిన బొచ్చు కుచ్చెలలో కాళ్లు వెచ్చనకై జొనుపుకొనుచు గడ్డిదుబ్బులలో కొమ్ములతో గోరాడుచున్న చమరీ మృగముల వాలకములు, చర్యలు చక్షుశ్చారువులుగా నున్నవి.

మరియొకచో పొదరిండ్లపొంత నక్కి నిక్కిచూచుచు పొక్కిలి జాలె నుండి జారు మదపంకము పరిమళములు పరిసరములకు పంచిపెట్టెడు చిరు కోరల చిటిపొటి కొమ్ముల కస్తూరీ మృగవారము.

వేరొకచో సౌరవిష్కారములు సన్నగా సొన్నాయిరాగము లాలపించుచున్నవి.

ఒక వల్మీక నితంబమునుండి పిపీలికలు బారులుదీరి శిఖరాభిముఖ ముగా బోవుచున్నవి. వల్మీక శృంగములపై చిరుగాలి సోకులకు లేలిహాన ములు లేచి పడగలు విప్పి యాడుచున్నవి.

ఒక రసాలసాలముపై ఫలగ్రహణ పరాయణములై కిశోరవానరములు శాఖా చంక్రమణములు చేయుచున్నవి.

అల్లంత దూరాన మానసకాసారమున కలహంసలు పద్మినుల పజ్జ జేరి తత్ప్రియబాంధవుని ప్రణయసందేశములు నివేదించుచున్నవి.

అచ్చట నావేళ ముచ్చటగా జరిగిన దొక ప్రాక్తన మహావ్యక్తి జీవన ప్రస్తావన.

★ ★ ★ ★

అట నొక ఊడలమర్రి నీడలో ఉపవిష్టుడై ఊర్ధ్వముఖుడై యోజనా వ్యగ్రుడై ఒంటరిగా నొక వ్యక్తి.

ఆ వృక్ష శాఖలనుండి వ్రేలాడు ఋషి పక్షుల విలక్షణ వీక్షణము లతని యూర్ధ్వదృష్టుల నాశ్చర్యముగా బలుకరించుచున్నవి.

అతడు దిగంబరుడు.

ఆకస మతని చుట్టు నావరించుకొని యున్నది. దహరమునుండి సహస్రారముదాక అతని అంతరంగపు టంతరాళ మంతయు నాక్రమించి యున్నది. ఆ నడుమ నతని మనుగడ.

బారెడు ప్రొద్దెక్కినది. పొగ మంచు పటాపంచలైనది. అత డేదో సుదీర్ఘముగా నాలోచించుచున్నాడు.

ఒకింత సేపు నలువంకల కలయజూచి బావురు మనుచున్న ప్రకృతిని జూచి తన యొంటరితనమును దలచి భయభ్రాంతుడై యొక పెనుబొబ్బ పెట్టినాడు. ఆ బొబ్బలో నతని మనస్సు 'నే నెవడ' నను నొక ప్రశ్న మేళవించినది. ప్రకృతి ప్రతిధ్వనించినది.

మరుక్షణము తన నిరంతరోచ్ఛ్వాస నిశ్వాసములచే నిత్యనూత్న మగుచున్నట్లున్న ప్రకృతి పరిణామ రామణీయకమును జూచి అంతలో నాశ్చర్యచకితుడు, నంతలో నానందపరవశుడు నగుచున్నాడు.

అర్ధనిమీలిత నేత్రుడై ఆ ప్రకృతి గతమైన తన మనుగడ యర్థము నన్వేషించుచున్నాడు.

నే నెవడను ?

ఎక్కడనుండి నారాక ?

ఎక్కడికి పోక ?

ఎట్లు వచ్చితిని ?

ఎందులకు ?

.... .... ....

అంతుపట్టని దాప్రశ్నపరంపర.

ఆలోచించినకొలది అతనిలో ఆరాట మెక్కువగుచున్నది. హఠాత్తుగా నెక్కడనుండియో రెక్కలూడి యిక్కడ పడిపోయినట్లు బుజము లొకపరి తడుముకొనినాడు.

పక్షులు కిలకిలలాడినవి.

ఆఁ! తన వెను కేదో జారిపోయినట్లు నడుముక్రింద తడుము కొన్నా డొకపరి.

కీశ కిశోరములు కిచకిచలాడినవి.

ఏమి టీపక్షులు !

ఏమి టీజంతువులు !

ఏమి టీచెట్లు, చేమలు ! కొండలు, కోనలు ! నదీనదాలు !

కొన్ని చలనము లేనివి !

కొన్ని చలనమున్నను చైతన్యము లేనివి !

కొన్ని చలనము లేకయే చైతన్యవంతములు !

కొన్ని చలనమును, చైతన్యమునుగలవి,

తనవలెనే కనులు, చెవులు, ముక్కు నోరు గలవి.

కాని తన్ను డాయవేమి ?

అవి యేవేవో ధ్వనుల నొనర్పగల్గుచున్నవి.

కాని తన్ను పలుకరించవేమి ?

పోనీ మరి తన్నింత పలుకరించుటకుగూడ పట్టించుకోని పక్షులు, జంతువులు వానిమానాన నవి పోక అల్లంతదూరమున నుండియే తనవంక తదేకదృష్టితో నట్లు చూచుచున్నవేల ?

ఈ లోకములోనికి తనరాక వానికిని అచ్చెరువు కలిగించినదికాబోలు !

ఈ ప్రకృతికిని తనకు నేమిటి సంబంధము ?

ఈ ప్రకృతి కింత యంద మెక్కడినుండి వచ్చినది ?

ఈ అంద మంతటిని తనదిగా నేల చేసికొనరాదు ?

ఇదంతయు తన యనుభవమునకు వచ్చుటెట్లు ?

అస లిదంతయు తన యనుభవమునకు రావలెననిపించుటేల ?

ఏమి టీకోరిక ?

ఎక్కడ దీని ఉత్పత్తి ?

ఈ ప్రకృతి తనది కావలెనన్న ఏమి చేయవలె ?

అస లిది యిప్పుడు తనది కాదా ?

మరి యెవరిది ?

దీనికి వేరే ఒక అధికారి యున్నాడా ?

ఉన్నాడు కాబోలు !

ఆతడు తనకంటె నధికుడా ?

కాబోలు !

అతనికి నాలుగేసి చేతులును బుర్రలు నుండునా యేమి ?

ఉన్నవి కాబోలు !

తాను నతని ప్రకృతిలోని యొక భాగమా ?

మరి యత డెక్కడనుండి యూడిపడినాడు ? ఎప్పుడు ?

ఏడీ అతడు ?

ఎక్క డున్నా డిపుడు ?

ఎటు చూచినను అతని జాడయైన నగుపడ దేమి బయట ?

తన లోపలగాని దాగొనియున్నాడా అతడు ?

లేదా యేదో మాయ క్రమ్మినదో మరపువచ్చినదో కాని యన లతడే తానా ?

అంతకంత కనంత ప్రకృతి రహస్యముబగురించి అంతులేని యాలోచనలు వింత వింత విచికిత్సలు చెలరేగుచున్న వతనిలో.

చండ గభస్తిమండల పిచండిలమైనది నభస్సు.

అతడు క్రమక్రమముగా సమాధ్యవస్థలో ప్రవేశించినాడు.

మార్తాండ మండలము నొక పరివేష మావరించినది.

మధ్యాహ్నము గడచినది. సాయంత్ర మైనది. చీకటి పడినది.

అతడు లేవలేదు.

దినములు, మాసములు, వారములు గడచినవి.

అత డట్లే యుండెను.

ఎండలు కాసినవి. గాడ్పులు వీచినవి.

మొయిళ్లు మొరసినవి, వానలు కురిసినవి.

అతడు చలింపలేదు.

అతని చుట్టును పుట్టలు బలిసినవి.

గుబురుగా పెరిగిన అతని కొప్పులో పిచ్చుకలు గూళ్ళు గట్టుకొన్నవి.

అతడు చలింపలేదు.

ఒక ఆషాఢవాసర ముషఃకాలమున ఆకస్మికముగా గగనము గర్జించినది.

గిరి గహ్వరములు మారెలుగిచ్చినవి.

అతనిలో హఠాత్తుగా నొక బాహ్యాస్పృహ కలిగినది.

కుబుస మూడ్చిన నాగువువలె పుట్టనుండి బయల్వెడలినాడు.

సుందరతరములయిన ప్రకృతి స్ఫురణల బరికించినాడు.

అతని కిప్పు డేమి చేయుటకును దోచలేదు.

అట్లు కింకర్తవ్యతా మూఢుడై యున్న అతనిలో నప్పటి కప్పు డొక కర్తవ్య బోధ యంకురించినది.

అతని యంతరంగమున అగ్నిభట్టారకు డొకపరి యావులించినాడు.

సమాధిభ్రష్టుడయిన యోగివలె అత డటునిటు చూచినాడు.

అల్లంతదూరమున నొక యామ్ర శాఖపై నొక బాలవానరము ఫలాస్వాదనము చేయుచున్నది.

ఆ చెట్టుకొమ్మలనుండి ఇంక ననేక ఫలములు గుత్తులు గుత్తులుగా వ్రేలుచున్నవి.

అత డొక రాయి తీసి ఒక గుత్తికి గురిచూచి విసరినాడు.

ఒక పండు త్రుళ్ళి ఎచ్చటనో పడినది.

పండు పడినదెస కతడు పరువెత్తినాడు.

ఆశ్చర్యము ! అట నొక తరుచ్ఛాయ - నొక శిలాతలమున సుఖాసీనయై మరియొక వ్యక్తి.

ప్రకృతి యంద మంతటికి ప్రతినిధివలె నున్నది.

ఆవ్యక్తికి దనకు నాకార పరిమాణములో నించుకంత భేదమున్నను నది యేమిటో ఆ వ్యక్తిని జూచుటతోడనే అతనికి తన యొంటరితన మంతయు బోయిన ట్లనిపించెను.

ఆశ్చర్యముతో నతడొకపరి బిట్టార్చినాడు.

ఆ అవ్యక్త మధురధ్వనిలో 'ఇంతకాలము నీకోసమేనా నేనెదురు చూచుచున్నది !' అనుభావ మపహ్నుతమైనది.

ప్రకృతి ప్రతిధ్వనించినది.

అతని గొంతు చెరవిడినది.

అపహ్నుత భావ ముపపన్నమైనది.

ఆకాశవాణితో నతని యంతర్వాణి జరుపు రాయబారముల మార్గమధ్యమున అతని జిహ్వాగ్రమున వాణి యావహించినది.

అతని మూగసైగల కర్థము లేర్పడినవి.

అర్థములకు శబ్ద సంకేతము లేర్పడినవి.

అత డాశించిన ఫల మామె యొడిలో బడియున్నది.

అత డామెను డాసి పండిమ్మని యడిగినాడు.

ఆమె ముసిముసి నవ్వులు నవ్వుచు, సిగ్గులు చిలుకరించుచు ఇరువురమును బంచుకొందమన్నది.

అతడు సమ్మతించినాడు.

ఇరువురును పండు పంచుకొని యారగించినారు.

టెంకదగ్గర తగవు తెగలేదు.

అసలది కొరుకబడలేదు.

అట్లని దానిని పారవేయుటకు వారికి మనస్కరించలేదు.

అట మట్టిలో నొక చిన్న గోయి తీసి అందు దాచివైచినారు.

ఇరువురు నెదురెదురుగా గూర్చుండి యొకరినొక రెగాదిగా చూచుకొనుచున్నారు.

ఉండియుండి 'నీవెవ్వర?' వని యడిగినా డతడు.

ఆమె తెలతెలబోయినది.

ఉండు మిపుడే తెలిసికొనివచ్చి తెలిపెద నన్నట్లుగా ఎచ్చటికో లేచిపోయినది.

సాయంకాలమైనది. ఆమె రాలేదు.

చీకటి పడినది. ఆమె రాలేదు.

ఆమె రాకున్న తన కెందుల కీ యారాటము !

ఆమెకు దనకు నేమి సంబంధము !

ఏమి టీ చీకటి !

ఇంత వెలుగు నొక్కపరి యెట్లంతర్ధానమైనది !

అరే అదేమి టా వెలుగు !

చిత్రము ! వెలుగు వెంట చీకటి ! చీకటిలో వెలుగు !

చల్లని వెలుగు !

వెలుగునకు వేడియు, జలువయు గలవా !

ప్రకృతి ఏమింత ప్రశాంతముగా నున్న దిప్పుడు !

కాని తన మనస్సులో నేమి టా కలవరము !

చల్లని వెలుగులో వెలుగు చలువకు తన యొడలు పులకరించియు భావనాడిలో వేడి యినుమడించుచున్నదేమి ! ఆ వేడి వెలుగు తనలోనే లీనమై అంతరించినదా !

చల్లని వెలుగులో ప్రకృతి సౌందర్య మంతకంత కగ్గలమగుచున్నట్లున్నదేమి !

అస లా ప్రకృతి సౌందర్య మినుమడించుచున్నదా ? లేక తన కేదో యట్లనిపించుచున్నదా ?

ఆ చల్లని వెలు గెక్కడనుండి వచ్చుచున్నది ?

ఆ తెల్లని బిళ్ళనుండా ?

ఆకసమునుండియేకాక ఆ సరస్సులోను అట్టి బిళ్ళయొకటి అగపడుచున్నదేమి !

ఆమె ఏది ? ఎక్కడికి పోయినది ?

ఆ చీకటివేళగాని తనలో ప్రవేశించి దాగొన్నదా !

ఆకస మంతట నేమిటీ లెక్కలేని చుక్కలు !

ఒక్కమాదిరివే అన్ని చుక్కలా !

ఆ చుక్కల కన్ని కాంతులా !
ఆ చుక్కల కాలంబ మెక్కడ ?
ఆకాశ మెంత విశాలమైనది !
శూన్య మెంత సుందరమైనది !

★ ★ ★ ★

తూరుపు రూపురేకలు బహుధా విధూమ్ర వికస్వరములైనవి.

అతని యూహావిహంగము లాశావైహాయస పథముల విహరించుచున్నవి.

అంతలో ఆకసమున నొక మూల నొక యాషాఢమేఘము మూల్గినసవ్వడి.

అది యేదో తన్ను పల్కరించుచున్న దనుకొనినా డా వెఱ్ఱిబాగులవాడు.

తానును దానితో నేదో మాటలాడబోయినాడు—

"ఏదీ నా ఎదలోపలి యెద
మధురాతిమధుర ఫలప్రద—
నా గుండెలు ఝల్లన
చల్లని చూపుల వెలుగుల
వెల్లువ వెదజల్లిన వేకువ—
నా గొంతుకలో నవ వసంతము
నావిష్కృత మొనరించిన
దేవత—
ఏకడ జొచ్చినదో !
ఆకసమున చుక్కలలో !
చీకటిలో నా చిత్తములో !
ఎవరో నా యెద తట్టిన స్వామీ

'ఇత డొక మహాకవి!'

పరిపరి విధముల పరుగులెత్తుచున్నవి వారి యూహలు.

ఒక సిద్ధు డనతి దూరమున నున్న యొక వానరుని వైపు, కట్టెదుట నున్న యొక కిన్నరునివైపు నొకపరి పరికించి, యా నడుమ చూపు నిగిడ్చి 'ఇతడు న....రు....డు' అని వక్కాణించినాడు.

'అవునవును. ఇటీవల బ్రహ్మగా రద్భుతముగా నొక అపూర్వవ్యక్తిని సృజించినారనియు, ఆ వ్యక్తి చరిత్ర భూలోకమున గొన్ని యుగములపా టతిచిత్రముగా ప్రవర్తిల్లగలదనియు, ఆ మహా చరిత్రను సంగ్రహించుటకు ప్రత్యేకముగా చిత్రగుప్తుడను నొక గొప్ప యుద్యోగి నియుక్తుడై నాడనియు వింటి' నని యందుకొన్నా డింకొక సిద్ధుడు.

'ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు
పితర్మాతర్యదిహోపబ్రువేవాం
భూతం దేవానా మవమే అవోభిః
విద్యా మేషం వృజినం జీరదానుమ్'

(ఆంధ్రపత్రిక విలంబ సంవత్సరాది సంచిక, 1958)

# కవి కైవారము

ఏ కవి ముఖముకురము కవి
తా కల్యాణి కలరూపుదాల్చె మొదట నా
మా కులపతి జగదేక మ
హాకవి వాల్మీకి మౌని కంజలి నింతున్.

మణులం బర్వములన్ శుభాక్షతలుగా మంత్రించి మా ఆంధ్ర ల
క్షణ సాహిత్య సరస్వతీ ప్రథమ సాక్షాత్కార పుణ్యాహవా
చనముం జేసి చళుక్య భూభుజ బుభుక్షా తృప్తిగావించి మిం
చిన గీర్వాణగిరాంధురంధర నమస్తే! నన్నభట్టారకా!

నీ కావ్యకల్యాణి నెల్లూరి నెరజాణ
ఒడుపు లెరిగిన వక్రోక్తి నిపుణ
ఆంధ్ర జాతీయతా సాంద్ర ముద్రాంకిత
భావోన్నతప్రగల్భ స్వభావ
నీచ పాత్రలనైన నిర్మాణ ఫక్కిక
చెక్కు చెదరనీని శిల్పచతుర
అచ్చు టచ్చుట ముచ్చటైన నాటక శైలి
సంవాది యగు సుప్రసన్నశీల
కాకతీయ సమ్రాట్టు నక్కజమువరుచు
కావ్యకళకు గాపురమైన కాణయాచి
సంస్కృతాంధ్ర సారస్వత సవ్యసాచి!
ఆమె నోమిన తిక్కయజ్వా! నమోస్తు!

రాయల రాణివాసమున రాకలు పోకలు రాయబారముల్
సేయఁగఁబోవ నొక్క మహిషీ నవమాలికనుండి రాలి చాం
పేయ మధూళి నీ కలము వెట్టెడు వ్రేళుల నంటి కావ్యమున్
వ్రాయుచు నున్నవేళ రసపాత్రము దాల్చెనటోయి తిమ్మనా!

ఆమని నామ్రపల్లవ సమాగత కోకిల కామినీ కృతో
ద్దామ రతిప్రకృష్ట మణితధ్వనులో! రవి యంధుఁడౌ రహ
స్సీమలలోఁ బ్రవాసములు సేయు రసజ్ఞతలో! అనర్ఘ కాం
తా మధురాధరామృత కణమ్ములొ! ధూర్జటి పద్య బంధముల్.

అల తిక్కన్నకు తీసిపోని కవితా సాక్షాత్ కళాపూర్ణ! నీ
కల భాషా కమనీయగాత్ర శుచిమత్ కావ్యాంగనాంగచ్ఛవుల్
దలఁపించున్ మన యాంధ్రలోకము నజంతా శిల్పి సామర్థ్యమున్
భళిరా సత్కవివౌదు! పింగళి కులీనా! సూరనార్యోత్తమా!

భాషాయోషకు భూషలౌ కృతులఁ గూర్పం జాలుటన్ శబ్ద శై
లూషీ జాలము భట్టుమూర్తి బహుళాంధ్రోక్తి ప్రపంచంబునన్
శ్లేషాశ్లేషము లంది అర్థగతి హల్లీసమ్మలే యాడె ప్ర
త్యూష స్వప్నములన్ సతుల్ పతుల నుద్బోధించు చందమ్మునన్.

సూరుల కవి శూరుల నొక
తీరున మెప్పించుకొన్న ధీరుఁడ వీనాఁ
డేరోయ్ నీవంటి కవులు
లేరోయి తెనాలి రామలింగ కవీశా!

నన్నెచోడుడు రఘునాథ నాయకు డాది
రసిక శేఖరులైన రాజ కవుల

పండితారాధ్యుండు పాల్కురికి సోమన్న
　　　　మున్నగు శివకవి మూర్ధమణుల
అన్నమయ క్షేత్రయ త్యాగయాది భ
　　　　క్త్యావిష్ట వాగ్గేయకారవరుల
మొల్ల రంగాజమ్మ ముద్దుపళని వెంగ
　　　　మాంబాది కావ్య సంసార చణల
సర్వ పూర్వాంధ్ర గీర్వాణ సాహితీ స
మాహిత స్వాంతులైన మహానుభావు
లా కులస్వాముల కవుల లాక్షణికుల
నస్మ దాచార్యవర్యుల నభినుతింతు.

* * *

నవయుగ ప్రవర్తకుల మనస్వివరుల
కందుకూరి వీరేశలింగము మనీషి
నల్ల గురజాడ అప్పరాయని తిరుపతి
వేంకటేశ్వరాది కవుల వినుతిసేతు.

* * *

ఎవడీ
అభినవాంధ్ర జగతి
అభ్యుదయ యుగప్రగతి
కవితా ప్రస్థానములో
కలమె కదం గుర్రముగా
దౌడెత్తిన
యువభావుక హృదయాశయ
జగన్నాథరథసారథి!

పంచకల్యాణి

ఎవడీ
భూతకాల వైతరణిన్
ఖాతువులగు జడబుద్ధుల
కులవృద్ధుల కురువృద్ధుల
కలమె గదాదండముగా
ధట్టించిన
క్రుద్ధ వృకోదర ధీరుడు !

ఎవడీ
దంధన ధన మదాంధ ఘన
దౌర్జన్యపు టూహాలపై
కలమె ఖండపరశువుగా
దండెత్తిన
నవ విప్లవ రవ భైరవ
మార్గాపరభార్గవుడు !
ఎవడీ
పతిత ధనిక పరివంచిత
ప్రజా హృదయ ప్రతినిధియై
కలమె విజయ కాహళిగా
ధ్వజ మెత్తిన ధనంజయుడు !

అతని కిదే
మదీయ మధురా
శయ మరందమయ సరోజ
నిచయాంజలి ! నిత్యాంజలి !

★ ★ ★ ★

అస్తవ్యస్త వర్తమాన కావ్యవ్యవస్థలో
ఆశలు పరికిస్తూ పరిక్రమిస్తూ
కవితా చరిత్రలో
కడచిన కాలం
కరాళ కంకాళం
కాదని వాదిస్తూ
నివేదిస్తా—
భావికాల భవ్యకవితా
భారతీ దేవతా
పునః ప్రావిర్భూతికి
పురోహితులైన
మహితాత్ము లందరికీ
నా నమస్సుమనస్సులు !

★ ★ ★ ★

తరతరాల దేశదేశ
సారస్వత సత్యవ్రతు
లెందరో మహానుభావు
లందరికీ వందనములు !

# కావ్యసూక్తము

ప్రతిభ యన్నది నిత్య నూత్నము
ప్రతిభ కవితకు ప్రాణసారము
ప్రతిభ ప్రకటితమైన చోటను
ప్రాత క్రొత్తలు లేవు కవితకు.

క్రాంత దర్శన మున్న చోటను
కావ్య గతులకు లేవు ఎల్లలు
దృష్టి దోషము లేని చోటను
కాల దోషము లేదు కవితకు.

నియమ మన్నది నిక్కమగు సం
స్కార జీవితసార సూత్రము
నియతి కవితకు కావ్య భాషకు
నిండు జీవము విలువ నిలుకడ.

సర్వ సారస్వతము నభిరుచి
సాక్షిక మ్మది భావగమ్యము
భావ మన్నది వ్యక్తి నిష్ఠము
వ్యక్తి వ్యక్తికి వాసి గల దది
సార్వకాలిక మైన సత్యము
కాన నానా కావ్య చర్చల
వలదు వల దతివాద శౌర్యము.

కావ్య మది యధికార గమ్యము
మనిషి మనిషికి తారతమ్యము
కలదు కావున కాదు కావ్యము
సర్వ జనులకు సంత వస్తువు.

ప్రగతి శీలము నతి విశాలము
నగు చరాచర జగతిలోపల
కావ్యగతి మార్గము లనేకము
సుముఖ జన సుగమములు సర్వము
సహృదయత యందలి రహస్యము
సర్వ సత్పథ సామరస్యము.

# పొలిమేరలు

దిగిరాను దిగిరాను దివినుండి భువి కనకు
ఎగురలే నెగురలేన్ భువినుండి దివి కనకు
దివి భువుల నడుమ నొక దీప మున్నాదిలే
కవితలో నా దీప కాంతి యున్నాదిలే.

ఆదర్శమే దీప మా దీప మంద దని
దాదాపు వెలుగులను దరిసించలే ననకు
దౌదవ్వులను కొరవి దయ్యముల నమ్ముకొని
నీ దారిలో నిరుల నేమరచి పోకోయి.

అతిశయోక్తుల కవిత లాలపింపకుమోయి
అతివాస్తవిక తనుచు అదరగొట్టకుమోయి
అభ్యుదయ కవి ననుచు మభ్యపెట్టకుమోయి
కలము కల దనగానె కవిత లల్లకుమోయి
కల మవల సంస్కార బలము కలిగుండాలి.

సంప్రదాయ విధేయ సాధ్వసము వలదోయి
సంప్రదాయ విరుద్ధ సాహసము వలదోయి
కాని యేదైనాను కలము ననుశాసిస్తె
నీ నిజాయతి కడ్డు నిలువనీకోయి.

దివినుండి ఎగర కిక భువినుండి మరి దిగకు
అతి మానుషము వలదు వల దమానుషమున్
మర్యాదగా నుంటె మానవత్వమె చాలు
మానవుని గుర్తిస్తె మన కవిత్వమె మేలు.

# వసంత శ్రుతి

(నవ్య కవితావిర్భావము)

ఏ యెలమావికొమ్మ నెలుగెత్తినదో యొక కోయిలమ్మ ఆ
హా ! యనిపించె కూహుకుహువా స్వర మశ్రుత పూర్వమైన నా
హ్వాయముగా పురాస్మృతి శుభాంతముగా రస రాగ భోగ సం
ధాయకమై రహించె కవితా లలితాకల మంత్రహూతియై.

ఆకూత సాకూతమై నవపల్లవ
మమతా సనాతనమై నవవన
వ తదీయ మధురానుభవ మహీయః కుతూ
హల రతి కూజితమై వనేంది
రా వందన శ్లోకమై వసంతాగమ
స్వాగత వాక్యమై పట్టపగలు
గ్రుడ్లు గూటికి వచ్చు గూబకు మేలుకొ
ల్పై తన తోడను వంతపాడ
గొంతు సవరించుకొనుచున్న గువ్వపిట్ట
కూన రాగమ్ములకు కోరి కోయిలమ్మ
యొరవడించిన వరుసయై పరిణమించె
కోకిలము పిట్ట కొంచెము, కూత ఘనము.

'ఆమని నోము' నోచె నఖిలార్తవ శోభలతో నరణ్య మా
రామముగా ; వనావన పరాయణ కోయిల గోలపెట్టగా
మామిడి కంటు గట్టిరట మాలి యొకొక్కఁడె ; అల్ల పల్లవ
శ్రీ మహితాత్మ తత్ఫల రుచిం బ్రచురించె రసజ్ఞ కోటికిన్.

మూసలు ప్రాతలైనను అపూర్వ విధా రస యోగసిద్ధు లా
పోసిన పోతలెల్ల నవి పోతలుగావు రసజ్ఞ చిత్తముల్
మోసులువారి మొగ్గతొడి పూచిన పూతలు గాని మూసినన్
వాసన లీను పోడుములు వాడని జాడయు దోచు వానికిన్.

# ఊరహో కలాపము

అది యొక సుఖ స్వప్న సుముహూర్తము
ముహుర్ముహు రీహోదోహల
మధురోహో మహోవర్తము !
అది వివిక్త మహోరాత్ర బహుజీవిత
మహో యాత్ర కవిముక్తము !

★

అది అపూర్వ శరత్పూర్ణిమా శర్వరీ పర్వ
సౌందర్య సర్వస్వ ధూర్వహా
సర్వంసహా !
అది విశ్రాంత తమిస్ర విధూదయ మృదూస్ర
వికస్వర వలాహక శకలైక ప్రకాశ
మాకాశము !
అది ఆకాశ విపులా తలాంచల విశాల
వివిధాశావకాశ పేశల
రాకాసుధాక రాలోక వ్యాకుల
సలిలౌఘ దీర్ఘ సమాసము
సముద్రము !

★

ఆ సముద్ర తీరమ్మున
అదిగో యొక శివాలయము
అతి శిథిలము ! శివాలయము !

శిథిలాలయ సవిధమ్మున
చిత్తభవుని చితి రగిలిన
స్థాణ్వాశ్రమ స్మశానమ్ము
నా నదిగో యొక సమాధి.

★

ఆచోట నావేళ అంభోధి అలలపై
గయ్యాళి గాలి వాహ్యాళికేళి
ఆచోట నావేళ ఆకాశ వీథిలో
జాబిల్లి మొగిలు దోబూచులాట.

★

ఆ సమాధి వేదికపై
ఆసీనుండై కవి యొక
డున్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి—

కలనైనా కనిపించని
తన ప్రేయసి సాకీ నా
కాశం బన్నట్లు కటా
ఉన్నా డున్మత్తుని వలె
మిన్ను వంక కన్నిగిడ్చి—

వెన్నెల కనుసన్నలలో
వెలిమబ్బుల వెనుక నొదిగి
ఊహల కందీ యందని
మోహనాంగి హొయలు దలచి
కావ్యాలాప కలాపము
కడుకొని చేయుచు, పాపము

ఉన్నా డున్మత్తుని వలె
మిన్ను వంక కన్నిగిడ్చి—
అపు డాకస్మికముగ నల
చంద్ర కిరణ మొకటి జారి
సంద్రములో పడి యక్కడ
నొక యల చెలరేగి విగు
ర్వించి విసరె నొక గాడుపు!
ఆశ్చర్యము!
కడలి బయల్వెడలినదో!
చదలనుండి జారినదో!
కాని యొకా నొక లతాంగి
మేనంతా మేలి ముసుగు
మేఘములో చంద్రరేఖ!
అదిగో తన కభిముఖముగ—
అడుగులు తడబడ
వడివడిగా సవ్వడి లేకుండగ
నడచుచున్న దొంటరిగా.
ఆలో నొక అఖిలాకారు
డతి క్రూరుడు
ముష్కర తస్కరు డతి దుష్కర
కార్య చికీర్షా ధుర్యుడు
కాంత డాసి కత్తి దూసి
నగలక్కడ పెట్టి మరీ
కదలుమనుచు బెదరించెను.

ఆ ధృష్టాధరోష్ఠ చటుల స్ఫోటనోద్భూతోద్ధుర
వాత విధూతమై
మే బాసెను మేలిముసుగు—
అహో సహజ మహోరాశి !
లోకోత్తర రూపోజ్జ్వల !
తన ఊహా దాత్యూహ
వ్యూహములో
విరిసిన విద్యుల్లత !
తన ఆశాకాశములో
వికసించిన రాకాశశి !
అచ్చముగా తన ప్రేయసి !
గత చంద్ర గ్రహణవేళ-
అతి కామార్థాతురులై
అభిసారము కాదు కాదు
వ్యభిచారము లాభమనెడు
బంధు జనుల బాధ రోసి
సంద్రములో సాగోరిన
చంద్రవదన ! జలదవేణి !

★

ఆ క్షణమ్మున అంగమెల్లను
అక్షులుగ వీక్షించి యామెను
సొమ్ము లుండిన చొప్పులేదని
తట్టలేదో తట్టినా యొక
ఆశ యెట్లును నాశమైనది
పొరుగు దేలను పొందరాదని

ఆసపడుచున్నాడు చోరుడు
'అన్న కన్నగ ! ఆభరణములు
సున్న నీవిక తప్పుకొ' మ్మని
ఆమె యన్నది.

'ఏమి వరుసిది యేమి మన్నన !
ఏకతమ యెలనాగ లెవ్వరు
నడికిరేయి పరాయి పురుషుని
పలుకరించెడి పాడిగా' దనె
వాడు గండర గండ మిండడు !

'బావ పోనీ బాకుగా కీ
రొండి లోపల రొక్క మున్నద ?'
అన్న దామె మహాద్భుతమ్మగ——

అపు డాకస్మికముగ నల
చంద్రకిరణ మొకటి జారి
సంద్రములో పడి యక్కడ
నొక యల చెలరేగి విగు
ర్వించి విసరె నొక గాడుపు !

శిథిలాలయ గర్భములో
శివు డొనర్చె సీత్కారము !
సమాధి చాటున కలకల
నవ్వెన దొక నృకపాలము !
కలవరపడి కల మెలకువ
నవధరించె కవీశ్వరుడు.

ఏరీ యా నిశాచరులు
వామకర్మ వశంవదులు ?
అదుగో చోర విషాణము-
సమాధి సవిధమ్మున నొక
పటు కర్కశ పాషాణము !
అదిగో మరి అభిసారిక
శిథిలాలయ శిల్పములో
శివుని వెనుక చిత్తమనెడు
చిత్తభవుని పరిచారిక !
అవేమి టా ఊళలు ?
కడతేరిన కవిస్వామి
కడతేరని ముడి యూహలు !
అదేమి టా సమాధిపై
చిత్రముగ శిలాక్షరములు !
"భావ కవి కట్టిన ఊహా కలాపములో
భామ వేష మెప్పటికీ తెరవెళ్లదు"

—(భారతి-జూలై, 58)

# రమణీ ప్రియ దూతిక

(ప్రణయ లేఖ)

రావే రమణీ ప్రియదూతిక ! భావజ వైతాళిక గీతిక !
భవదాగమనాశాభజనిక నా మనసిక నవసిపోక -

నా చింతా నిరంతర చిరంతన నిరీక్షణ
కంతరాయ మాప్యాయముగా -

మా కులపతి జగదేక మహాకవి శ్లోకమువలె
నా యెంచిన యెడద చదల పొడగట్టిన మొగిలు పగిది

రావే రమణీ ప్రియ దూతిక ! భావజ వైతాళిక గీతిక !
మరల మరల పరామర్శ లెందులకే

మరువలేనా రస విస్మృమర స్వరభాసుర రాగ రుచిర
హృదయగాత్ర రూపములవి
లలితకళా ఫల శ్రుతులు !
నా కవితా వ్రత దీక్షా శుభాక్షతలు !

రావే రమణీప్రియ దూతిక ! భావజ వైతాళిక గీతిక !

(తెలుగు స్వతంత్ర, 14-5-54)

# మధురలాలస

హ్లాదమయీ ! వసంత కుసుమాకర మల్లదిగో అదే సుధా
స్వాదు మధువ్రతాత్మ రసపారము నంటినచోటు పూర్ణచం
ద్రోదయ పుణ్యకాల మిదివో ఎదలేకముగా పఠింపగా
రాదటె యింక సిద్ధమకరధ్వజ దైవత మంత్రపుష్పమున్.

మధు మకరంద బంధుర సుమవ్రజ సుందర మీ వనమ్మిదే
మధుర మదాశయాశ్రయము మత్ప్రియ రూపరమానుభూతి మ
న్మథ మధురాజ మంత్రుల సమజ్ఞలఁ జాటినచోటు వందిమా
గధ నుతులై పికస్వర వికస్వర సూన సఖాళి గానముల్.

అది వనేందిర ప్రసవించి నట్టిచోటు
అఁహఁ ! లతలు పుష్పవతులైన యట్టిచోటు
ఏకమైపోదమా పూవుటీరమందు
ఎంకి పాటల గీతి సాహితుల పగిది.

స్వాగతవేళనే ప్రియవయస్య ! ఎదో యనఁబోయి యంతలో
నాగితివేమి పచ్చపువులట్టుల వెన్నెల లున్నవంటివొ
నా గురుదేవునాన యది నచ్చదు నాకిక నా మనస్సులో
నాగక వచ్చునట్టిది రహస్యముగా నొక మాట చెప్పనా !

పూచుటే గాని కాయగాబోని పూల
తోట మాలిని- అల్ప సంతోషి నేను

వలదు సుకుమార కుసుమాసువుల గ్రసించు
ఫలము ఫలద నిర్గంధ పుష్పమ్ము నాకు.

ఇది కవిత్వము కాదు సుమ్మిది మదీయ
హృదయ మాకంద పాదప మృదులశాఖఁ
గూరుచున్న కుతూహల కూహుకుహూవు
కొసరి విసరిన సాకూత కూజితమ్ము.

(కృష్ణా పత్రిక 9-4-55)

# మనసులోని మాధవితో

పున్నమ వెన్నెల్లో పూచిన పువ్వుల్లో
నన్ను చూసి చిరు నవ్వులు చిందే
కన్నెపిల్ల కెది కావాలో
కనుగొని చెప్పవా చెలికాడా !
కనిపించని చనవులు గలవాడా !

నల్లని మబ్బుల్లో నక్కిన చుక్కల్లో
నన్ను చూసి కనుసన్నలు చేసే
కన్నెపిల్ల కెది కావాలో
కనుగొని చెప్పవా చెలికాడా !
కనిపించని చనవులు గలవాడా !

క్రొన్నన తేనెల్లో వెన్నెల సోనల్లో
నన్ను చూసి ప్రన్నని చవులూరే
కన్నెపిల్ల కెది కావాలో
కనుగొని చెప్పవా చెలికాడా !
కనిపించని చనవులు గలవాడా !

గుబురుల గూళ్లల్లో గువ్వల పాటల్లో
నన్ను చూసి కంఠము సవరించే
కన్నెపిల్ల కెది కావాలో
కనుగొని చెప్పవా చెలికాడా !
కనిపించని చనవులు గలవాడా !

స్యైర పయ్యెద సయ్యాటల్లో
న్ను చూసి క్రన్నున పులకించే
న్నెపిల్ల కెది కావాలో

కనుగొని చెప్పవా చెలికాడా !
కనిపించని చనవులు గలవాడా !

తా నీ ప్రొద్దున మానక మాకడ
ధనుర్మాసమున దాసరి పాడిన
జనార్దనాష్టకమును పునశ్చరణ
మొనర్చినదోయి !

ఇక సహించలే మిక భరించలేం
చలియైతే నేం, వలపైతే నేం
కలిసిరాని శివరాత్రి కష్టమున-
ఓమా నెమ్మది కుమ్మడి నేస్తం !
మామా కలాప మంతా వినివిని
ఏమంటావో ఇక నీ యిష్టం !

(జ్యోతి మే, ౫౮)

# ఉపశ్రుతి

ఏ పద సమీపమున ప్రణమిల్లినవియొ
నాదు జీవితాశా ప్రసూనము లొడళ్ల
క్రొత్తగ వలపులు పులుము కొనియె నవి భ
వత్పదాబ్జ పరీమళ పరిణతములె.

మతి యను లేఖినీ ముఖము మానసపత్రము నందు నిల్పి ని
శ్చిత శుభయోగ దీక్షను రచించితి నెద్దియొ అస్మదీయ జీ
విత నవనీత రాగరస పిచ్ఛిలమౌ ప్రణయ ప్రబంధమున్
గతజలసేతుబంధనము గావలెనా అది యంత నింతలోన్.

నేడు పరువంపు పొళ్లలో నిగ్గులొరసి
పట్టపగ్గాలు లేకుండె పడుచుఁదనము
రేపు మాపుల మన రూపురేక లెట్లు
మారిపోవునో యేమొ నా మాట వినుము.

వయసు తీవియ పూచిన వలపు పూల
మదన దేవతార్చనము సేయుదమె చెలియ
తీవెలో తీరు పూవులో తావి గలిసి
నీవు నేనైతి మనుమాట నిక్కువమ్ము.

అతని పూజలో కర్పూరమై హరించి
పోవనిమ్ము మన సమస్త యౌవనమ్ము

యమునిఁ శిక్షింపనిమ్ము లోకము శపింప
నిమ్ము మనల నెవ్వరు విడదీయలేరు.

సకల చరాచర ప్రకృతి సాక్షిగ మామక హృద్విపంచి నో
పిక గొని మేళవించితిని ప్రేమ పదార్థ యథార్థ గీతికా
ప్రకరము లెన్నియో విధి విరామములేక తదీయ సర్వమున్
ఒక కలలోని వార్తయన నొప్పరికింపకుమా మనోరమా !

# కాంక్ష

నయనమూ నయనమూ నాట్యమాడేవేళ
మింటి చుక్కలు మన కంటిపాపలలోన
మినుకు మినుకన్నాయి

హృదయ వీణలు రెండు మేళవించేవేళ
మధురస్మృతు లెవో మంజుల శ్రుతులుగా
మారుమ్రోగినవీ

మనసునే మరపించి కనుపించు కలలో
అది యేమిటో కాంక్ష కదలి పోతున్నాది

విరహ విహ్వాల హృదయ విధుర వీణాతంత్రి
విశ్వమోహన గీతి వినిపించుచున్నాది

తీరనీ వలపులో తీయనీ తలపులో
కనిపించు నందాక కలలనే కందామ ?

ఆరనీ స్మృతిలోన ఆగనీ శ్రుతిలోన
వినిపించు నందాక వీణలే విందామ ?

(రేరాణి మే. 49)

# సహవాసము

ఆమనివేళ వెన్నె లలరారెడు రేల తమాల సాల సు
శ్యామల సీమ నొక్క మస్పృష్టైందవ కాంత వితర్దిపై మధు
స్వామిఁ దలంచుకొంచు ప్రియవల్లభ మేనున మేను జేర్చి ఆ
మైమరపించు కౌఁగిలి సుమాళములోఁ గనుగొంటి స్వర్గమున్.

కవుల కలాల పోకడల కందని యూహలు కొన్ని లేనిపో
నివి వెనువెంట వేసికొని నింగికి నిచ్చెన లెత్తుచుండ చే
రువ చిరుగాలి రేపిన కురుల్ సవరించు సఖిన్ బిరాన మ
క్కువ మెయి నొక్క ముద్దిడ గగుర్పడె మేను మరుల్ బుగుల్కొనన్.

చల్లని పిల్లతెమ్మెరలు చక్కిలిగింతలు వెట్టుచుండ నే
పిల్లనగ్రోవి నూదుకొనువేళఁ గురంగటఁ బ్రేయసీ మనో
వల్లి కడింది తన్మధుర వాంశికగాన మరుద్విధూతమై
తల్లడిలన్ గనుంగొను విధమ్మునఁ గౌఁగిఁట బుజ్జగించితిన్.

లలిత లతాలతాంత మధులాలస భృంగ విలాస లాస్యముల్
మలయ మరుత్తరంగ వలమాన పరాగ పరీమళమ్ములున్
పొలయలుకం గలంగి విడిపోవునెడన్ మము నూరడించి, కో
ర్కులు పురికొల్పి యొండొగులఁ గూర్చి వెలార్చె వియోగవేదనల్.

కోయిల వాతిలో గులుకు కూఁతల కుబ్బిన నా యెడందలో
తీయ తలంపులో తనివితీరని కోరికలో క్షణక్షణ

మ్మూయలలూగు మత్ప్రియ వధూ_క్త వినిర్మల నర్మగీతి నెం
తో యొరిమన్ వనప్రియ వధూటి బళీయన నాలపించితిన్.

★ ★ ★ ★

ప్రతి సంవత్సర జాతకంబున పునః ప్రత్యగ్ర యోగంబులై
ఋతువుల్ రాకలు పోకలున్ జరుపుచుం దేతేర దేనాటికిన్
గత రాత్ర స్మృతిమాత్రమ_త్త దనురాగప్రీతి పాత్రమ్ము ; జీ
విత మాద్యంతము చోద్యమాయెగదె సంవిశ్లేష యోగంబులన్.

# ధ్రువ తార

నెచ్చెలీ ! కంటె నీ కనీనికల వోలె
నిజ నిరత్యయ ద్యుతుల రాణించుచుండె
ఆకసమ్మున చీఁకటి రేకలందు
ఒంటి పిల్లి గాకాసియై యొక్క చుక్క !

కష్టజీవిత శృంగాటకమ్మునందు
దిక్కు తెలియ కల్లాడు నీ దీనపాంథు
నుత్తరాశోన్ముఖు నొనర్చి యూరడించు
దూర దూరాల నా మ్రోల దోయిలించు.

ఎందఱో పాంథు లీదారి నేఁగినారు
తొలఁగ దీ చుక్క మాత్రము తొంటిత్రోవ
అంతుఁ గనుగొంటి నేఁడుగదా త్వదీయ
రమ్యనేత్ర నేపథ్య తారాపథమ్ము.

# ముత్తైదువ

మనసొక డోలయై అధికమాసపు టూహల నూగ నొక్క శ్రా
వణ దివసాంతవేళ నలువంకల నెవ్వరులేని మేడ మీఁ
దను గదిలో గవాక్ష సవిధమ్మున గూర్చుని పావికావి గ
ప్పిన మొగ మొక్కసారి నడువీథికిఁ ద్రిప్పితిఁ ద్రిప్పునంతలోన్.

యాతాయాత సువాసినీజన దిదృక్షా స్ఫీతిఁ జూతుంగదా
ఏతత్ శ్రావణమాస వాసర వ్రతాపేక్షావృత స్వాంతలై
సీతాకోకపుఁ జిల్క లట్లు బహుధా చిత్రాంశుకాధాన సం
ప్రీతిం బోయెడు పేరటాండ్ర పొడవుల్ క్రీడించె నేత్రమ్ములన్.

తిలకము దీర్చి కజ్జలము దిద్ది జగా జలతారు చీర కు
చ్చెలు సవరించి కట్టి విరిసేరులు వాల్జడ గిల్చి సోగ క
న్నుల సొగసుందనమ్ములె కనుంగొనువారికి కాన్కవెట్టుచున్
పలువురు క్రొత్త ముత్తయిదువల్ గనుపట్టి రొకే విధమ్ముగన్.

నలువురిలోన నాణ్యమగునట్టి నగల్ వలువల్ ధరించి నె
చ్చెలు లెకసక్కెమాడ నునుసిబ్బితిమైఁ దలవాంచికొంచు నే
రలి కడకేఁగె నొక్క జవరాలెవరో కలవారి క్రొత్త కో
డల ననిపించుకోఁగల నడల్ మురిపమ్ములు మూటఁగట్టుచున్.

ఆమెను మా పితృష్వసయు నా దెసఁ బోవుచుఁ జూచె నంత నే
వో మధురస్మృతుల్ గలిగెనో యనునట్లుగ నిశ్వసించె మా
మామయగారు తన్ను దలమాపకమున్ను చిరంట్లు నోచు నీ
నోముల పుణ్యమెల్లను దనుం గడియించియు నిట్టులుండుటన్.

(భారతి - ఆగస్టు, 50)

# నవోఢ

కలికితనంపు నిండు నవక మ్మగుపించె నొౌడ ల్కడాని కాం
తులఁ దులతూగె సొంపిలెఁ గనుంగవ కప్పు కళాయిచొౌప్పు బు
గ్గలు నునుపారె మోవులు తొౌగర్చె పిరుందులు బూరటిల్లె ను
గ్మలి కుచయుగ్మ కుట్మల వికస్వర యౌవన చైత్రవేళలన్.

తలిదండ్రుల్ దన పెండ్లిగూర్చి తలపోఁతల్ సేయు నవ్వేళ బొ
మ్మల పెండ్లిండ్లను గట్టిపెట్టి నిజ దాంపత్యార్థి భావాళికిన్
కలలే కాపురమై చెలంగఁ జెలులైనన్ విస్తువోఁజాలు సి
గ్గుల ముగ్గుల్ బచరించె జవ్వనపు నిగ్గుల్ నించు లేబుగ్గలన్.

ఆ కల్యాణ మనోజ్ఞ మంటపమునం దానించె నెమ్మోము డా
మోకాల్మీఁద ; నిసర్గ నిర్భర వయః స్ఫూర్జ ద్వపుఃశ్రీ శర
ద్రాకేందు ద్యుతిమన్నభోనిభ నవోఢా గాఢ వ్రీడాభరం
బేకాంతమ్మునఁ గాంతుఁ జేరు తరియం దేమాయె నమ్మాయికిన్ ?

(గృహలక్ష్మి - జూన్, 51)

# పరామర్శ

ఆకల్లాడని నీడలేని యొక తాళానోకహాధఃస్థలిన్
లోకం బర్యమతిగ్మ భానువులకున్ లోనై అఘోరించు నెం
డాకాల మ్మపరాహ్ణవేళ నొడలంతా నిర్భరస్వేద గో
దా కూలంకషఁ గ్రుంకువెట్ట నిట గాదం ద్రవ్వు నీ వెవ్వరే !

ఎవ్వరని యెంతురో నిన్ను-ఈవు భయద
మృత్యు దూత జరా భూత కృత్స్న జర్జ
రిత శరీరవు, గాఢ దారిద్ర్య కాద్ర
వేయ జిహ్వావలీఢ జీవితవు నీవు-

బ్రదుకు భళ్లున తెల్లవారినభంగి నీ
నెరులెల్ల బొత్తిగా నరసిపోవ
కన్నులు గుంటలై కణత లుబ్బినచోట
మృత్యుదేవత గ్రుడ్లు మిటకరింప
ముడుతలు ముడుతలై ముడుసులు ముడుసులై
యొడలి యాయువుపట్లు సడలిపోవ
ఏడుకట్ల సవారి కెదు రంకవన్నియ
ముదిమి మూడవకాలు ముందు సాగ
నాడి, జీవుని గడియార మాడువరకు
వేసరించియు నుపకార వేతనమ్ము
లీయ నెరుగని కామందు లిండ్ల నెన్ని
నాళు లీ గొడ్డు చాకి రెన్నాళు లవ్వ !

పాప మీ ప్రాయపు మాపటివేళ అ
　　వ్వా ! నీకు బువ్వ లేదాయెనటవె
నీ కష్ట సుఖములు నెరి విచారించెడు
　　తాత సైతాను వాత పడెనటవె
కోడండ్రతో కొడుకులు తోడుదొంగలై
　　ఎక్కచ్చి కాపురా లేగిరటవె
కామందు వొక్కడు కలడంటె గొడ్లకు
　　గడ్డి తెచ్చినగాని కాని యీడు
కలిమి కచ్చగట్టిన లోభికన్న వచ్చి
కసవు మెసవి పాయసమిచ్చు పశువు నయము
బుద్ధి ! ఇకనైన కామందు గొడ్డు నోట
గట్టిగా నింత గడ్డిని పెట్టిచూడు.

కాదు కాదది కొరగాని గడ్డిపరక
సత్యమది యవశ్యంభావి సామ్యవాద
జయపతాక, దంధన ధన స్వామ్యవాద
శ్రాద్ధ పార్వణాంకితము దూర్వాంకురమ్ము.

—(స్వతంత్ర, 28-5-54)

# దృష్టిభేదం

ప్రియవయస్యుని ప్రేమపాశపు
తీపిత్రేపులు తీయవలసిన
దోరవయసుది !
మగ జగత్సమస్తకాంక్షా
దిగ్గాక్షుల దిస్టితగిలిన
జగాసొగసుది !

ప్రొద్దుతిరుగుడుపువ్వు బ్రదుకట
పాప మాయమ పుట్టుమొదలుగ
బిచ్చగత్తెట !

నిద్దురెరుగని కన్నుగ్రుడ్లులు
నీడ నెరుగని యొడలి బడలిక
కూడు నెరుగని కడుపుముడతలు
నెత్తురురవు నెమరేసిన
నిరుపేదా నిమ్నగాత్రి

పట్టపగలు - బట్టబయలు
నీరింకని
ఇంకిన నిగురని
చింకిచీర చెరగుల్లో
సిగ్గులు శివమెత్తిన

ఇలా

## దృష్టిభేదం

చిన్నదాన్ని
చూచూస్తూ
ఒక దుకాణదారు గారు
కటా! బోణీ కాలేదనె

ఆ రొమ్ముల సంసారొక
నిట్టూరుపు నిగిడించెను
చదువుకొన్న సరసు డొకడు
'సెక్సపీలు' సెహబాషనె
తన సరి యొక బిచ్చగత్తె
ఈసున పండ్లిగిలించెను
రాశా డొక సుకవీంద్రుడు
సానుభూతి గీతావళి.

(సమీక్ష - ఫిబ్రవరి. 51)

# సమన్వయము

అది ప్రియురా లిది పేదరాలు
ఎద కెవ్వరు నెడము కారు
నవ కావ్య కథానాయిక
లెవరంటే వా రిరువురు
అది శృంగార పరాకాష్ఠ
ఇది కరుణరస పరామృష్ట
ఆ రసముల కవే సాటి
నీరసాత్ములకే పోటి

ఇటు చూస్తే శ్రీశ్రీ - అటు చూస్తే కృష్ణశాస్త్రి
ఇరువురు నిరు తెరగుల కులగురువులు
ఎవరెక్కువ ? తక్కు వెవరు ?
కవుల దృష్టి వివిధము గద !

తాజమహల్ తయారులో-
శిల్ప సుషమ - ప్రేమ మహిమ రాళ్లెత్తిన కూలీ శ్రమ
ఒక్కొక్కరి గురి యొక్కటి
గురియన్నది గుణగ్రహణ చణ సాధ్యము
కావ్యమునకు వస్తువు కా దానందము పరమార్థము
సందేశము సదాశయము
ఇది సమయము సమన్వయము.

(స్వతంత్ర, 30-4-54)

# 'తత్త్వమసి'

(అమరు కావ్య గాథ యాధారము)

ఎవ రా చల్లని తల్లి శంకరుని బ్రహ్మీభూతు గీతాది భా
ష్య విధాతన్ పరమ ప్రమాప్రవణు మిథ్యావాద విద్యాధరున్
వివిధజ్ఞున్ నిఖిలజ్ఞు జేసిన యశోవిశ్వంభరాదేవి ! ఆ
భవభూతి ప్రతిభాతిశాయి రసికత్వస్థాయి నూహించెదన్.

కిమిదం పూర్వ పదార్థ పారగుని శృంగేరీ మఠాధ్యక్షు ను
త్తమ శృంగార సముద్ర మందర మహీధ్రస్వామిగా జేసె న
య్యమరాఖ్యామరుకావ్య కార్యకలనా హంకార హంవీరు నా
ప్రమదన్ మండనమిశ్రు నాశ్రమ రమారామన్ ప్రశంసించెదన్.

కౌమారిలమునకు కామసూత్రములకు
నంబ పలుకు జగదంబ పలుకు
మండనమిశ్ర కర్మ బుభుక్ష కన్నపూ
ర్ణాదేవి పుణ్య హస్తోదకమ్ము
వ్యాస స్వయంపాక మాదిశంకరు నఖి
ఘూరమ్ములకు వేల్పు టారగింపు
తర్క కర్కశ పండితమ్మన్య మతులకు
తంతన్యమాన చింతాఫలమ్ము
ప్రౌఢ కావ్య ప్రబంధ గిరాం ప్రమాత
లైన రసికుల కమరు కావ్యావతార
యోగ మమరించినట్టి యమోఘ వాణి
మా యుభయ భారతీదేవి మహిత ఫణితి.

ఒకఁడు కర్మంది, కర్మిష్ఠు డొక్కరుండు
ఉభయులకు మధ్య తానాడె నొక్క మాట
తారుమారాయె వారి జాతకము లామె
పలుకు ప్రత్యక్షరమ్ము నిష్పాక్షికంబు

మధ్యాక్కర

తదుపజ్ఞమైన యద్వైత తత్వ మన్వర్థ మగుటకు
త్వదుపపాదిత మాయెనుగద తార్తీయ పురుషార్థ మాయె
గద సర్వ కూర్పాస మదియు కడ కాదిశంకరు సూత్ర
మది యభిజిత్తు 'తత్త్వమసి' యనిపించుకొం టీవె దేవి !

—(భారతి-ఏప్రిల్, 53)

# శారద రాత్రి

శారద రాత్రి నా శశి యశస్సులు వెన్నెల లాకసంపుటా
శ్వారున కూర్ధ్వ పుండ్రకములై అలచుక్కల పేరటాండ్ర శృం
గారమునందు సుందరముగాఁ గనుపట్టు పదారువన్నె బం
గారపు బాజు బందులయి క్రాలెడు చల్వల చాటుధారలై.

పున్నమకన్నె చిక్కసము పోసెను వెన్నెల వాయనమ్ము ల
ప్తన్నులమిన్న మిన్నుల మిటారికి శోభనమంచు షోడశ
ప్రన్న కళాప్రసన్నము శరత్సశశాంక నిశీధ లగ్న మా
సన్నముగాగ నున్న దొక చక్కని చుక్కకు చందమామకున్.

ఒక టొకటే శశీషు కషణోజ్జ్వలమై దిగధీశ బాల బా
లిక లపు డాడు కేళిక యశీకపు వెన్నెల కుప్పలై వలా
హక శకలాలు శుభ్ర శరదభ్ర పథభ్రమణమ్ముగా కకా
విక కకుబంతముల్ వలస వెళ్లెను గాలికి దూది పింజలై.

తూరుపు రూపురేకలు విధూమ్ర వికస్వరమైనయంత ని
ట్టూరుపు లూర్చె పట్టపగ లుత్తకలల్ గని జన్మమెల్ల రే
యూరక జాగరాల్ జలుపు నొక్క దివాంధము దిట్టిపెట్టె సిం
గారపు చిన్ని తారక నొకర్తుక చాంద్రమసాభిసారికన్.

ఉన్నటు లుండి యుల్కిపడెనో ! ఉడుయోష చెరంగు మానెనో !
అన్నటు లా ముహూర్త మజహద్గ్రహణావసరంబొ స్వామికిన్ !
సన్నకసన్న వెన్నెల పసందులు మందటిలెన్—మహాకవుల్
మిన్నక యొక్కవేళ మిసిమింతులునై మిను జూచునట్లుగన్.

(భారతి – ఫిబ్రవరి, 54)

# శుభ లేఖ

కరవున కగ్గమై ప్రజ రెకాయెకి ముప్పదిమూడు కోట్లు క్రి
క్కిరిసిన దేశమందు బ్రదుకే ఘనమంచు ప్రజాప్రభుత్వ మూ
పిరి నిలుపోప నిచ్చు చిరువృత్తి జరించెడు నా కణా వినా
అరువదియేడు జీత మకటా యిక జీవిత మెట్లు సాగునో !

అస్మదీయ జీవితకోశమందు పనికి
రాని పదములే గాని అర్థములు లేవు
'నాది' యనుదాని కొండె నానార్థము లగు
పించు బోలెడు పెండ్లాము పిల్ల లనఁగ.

ఆలుం బిడ్డల కన్నవస్త్రములనే యార్జింపలేకున్న నిం
కేలా యీ కసుమాలపుం జదువు లెందే నొక్క కాంతారపున్
మూలం గూర్చుని ముక్కు మూసికొనియో ముష్టెత్తియో వాడలన్
గాలక్షేపము సేయరాదె యని యోగాముల్ వితర్కించుచున్.

ఒక్క సెలవునాఁ డధికారి డొక్క దురుసు
కాక తన పుట్టినింటికిఁ బోక ముందు
యేల నూగించు నిల్లాలి లాలిపాట
తలఁచుకొనుచుండ నొక కేక తాకెఁ జెవిని.

కాకీ కోకలు గట్టి కెంపు తలపాగా జుట్టి కేలన్ దవా
లాకీలించి ప్రభుత్వ భృత్యుఁ డొక వార్తావాహు దేతెంచి యే
దో కమ్మన్ గొనితెచ్చె పచ్చనిది తోడ్తోడన్ 'భళీ శంభళీ !
నాకై శ్రీమతి పంపె నిన్ననుచుఁ జించన్ మేను కంపించెడిన్.

మొన్నటి రే మా యావిడ
కన్నదియట ఒక్క యాఁడు కవల ! ననఁగ నం
దున్నది చూడ హతవిధీ !
కన్నులు కడు పచ్చబారె కమ్మ పగిదినే.

(భారతి - ఫిబ్రవరి, 51)

# అక్షత!

పుట్టి పదునారు చైత్రముల్ మెట్టలేదు
పుట్టి మునిగిన ట్లంతలో పొలతి పెండ్లి!
అకట సంసార శాఖిక నొక ఫలమ్ము
బడయలేదు పాప మపుడే పతి వియుక్తి!

సారె గదికి సఖులు సాగనంపినవేళ
ప్రియ సఖుండు చేర బిలుచువేళ
అతని చెంత స్వర్గ మందుకొనినవేళ
ఆమె పడిన యాస కర్థ మేమొ!

పెండ్లి పీటల మీదను ప్రియుని గాంచి
దిగ్గునన్ సిగ్గుచే తల దించువేళ
ఆర్యు లెల్లరు జల్లిన యక్షతలకు
వధువు తల యొగ్గుటే పొరపాటొ యేమొ!

# బొమ్మ రిల్లు

బడి విడచునంత నింటికి పరువులెత్తి
పలక బలపాలు గూటిలో పదిలపరచి
అమ్మ యిచ్చిన పప్పు బెల్లమ్ము దినుచు
నాడుకొనబోదు వీవు సాయంతనమున.

ఊరి దాపల నొక సెలయేరు గలదు
కల విసుక పసకలు దాని గట్టుమీద
ఇచ్చవచ్చిన మచ్చున నీ వచటను
ఈడు జోడైన వారితో నాడుకొనుము.

గట్టు మీదనె యెంతైన గంతు గాని
లోతెరుంగని నీళ్ళ గాలూన బోకు
పెంకి పిల్లలు పేచీలు పెట్టునపుడు
మంచి వస్తాదు నేస్తాల మరువు చొరుము.

అలతివాడవు చెడుగుడు లాడలేవు
నేల విడిచిన సాము నీకేల? వినుము
చెంత సెలయేటి చెలమలో చెమ్మగిల్లు
నిసుకతో నాడుకో బొమరిండ్లు గట్టి.

ఇరుగు పొరుగుల బొమరిం డ్లమరుచుకొన్న
చెలులతో బొమ్మ పెండ్లిండ్లు సేయునపుడు
తరలివచ్చును పుల్గు ముత్తైదువలును
గూళ్లు విడిచి మీ గుజ్జనగూళ్ళ దరికి.

బళిర ! బొమ్మరిం డ్లాట పాటలను గడచు
చీకు చింత లెరుగని నీ చిన్నతనము ;
పెరిగి పెండ్లము తోడి కాపురము సేయ
కలదు నీ పనిబట్టు నిక్కాంపు టిల్లు !

## 'బాలారిష్ట'

పుస్తెలపై పుస్తెలు
ముడిపడుతున్నయ్
పురుళ్లపై పురుళ్లు
దిగబడుతున్నయ్
కుక్కమురికి సంతానం
క్రిక్కిరిసి
పుడమంతా గిడసబారి
అంతకంత కిరకటమై
పోతోందిది

మా కర్మభూమి కర్మ
ఇక్కడ
ప్రతి యిల్లూ ఒక ఊదలమర్రి
ప్రతి తండ్రీ ఒక కుటుంబరావు
ప్రతి తల్లీ ఒక పిల్లలకోడి
తమను కనమని దరఖాస్తు పెట్టని
పిల్లలను కనేసి
ఆ పసి పాపల ముఖాలపై
దారిద్ర్యపు ముద్ర వేసి
తమ పేరు మీదుగా
తద్దినాలు ప్రసాదించి
వెళ్లిపోతున్నారు తల్లిదండ్రులు

కన్నకొడుకు లడుక్కోవడం
కన్నకూతురి ప్రసూతివేదన
ఎరుకపడని ఎక్కడికో !

ఆ పిల్లలు
కీచంటులు పడి
నవగ్రహ కవచధారులై
మందుల ౖతాగుబోతులై
ఎలాగో పెరిగేసి
ముదనష్టపు బ్రదుకు
సొదలు మొదలై
తలిదండ్రులు చేసిన తప్పే
చేస్తున్నారు—
'ప్రజాయై గృహమేధినాం' బుక్కు
బుజువు పరుస్తున్నారు
ప్రాచీనమైనదంతా సమీచీనమని
భ్రమించే పామరులు !
తమ సమస్యలు తామై తెమల్చుకోలేని
అమాయికు లసమర్థులు !

అంటారుగాని కొందరు
అంటురోగాలు కరవులు కదనాలు
పంచవర్ష ప్రణాళికలూ
పరిష్కరించలేని దీ
భారతదేశపు బాలారిష్ట—
దారిద్ర్యమునకు పరాకాష్ఠ.

# బహువ్రీహి

భవతి భిక్షాం దేహీ యని
పాహీ యని వేడితిమి బాబూ బహువ్రీహి

కరగదేమోయ్ నీ గుండె కఱ్ఱాయి కాబోలు !
నీ సోదరు లీ పేదల సొద చూస్తూ పెదవి విరచి
నా దగ్గర నేం ల్లేదని వాదించకు వేధించకు
నీ గాదె క్రింది పందికొక్కు సోదె చెప్పిందిలే మాకు
నీ దౌలత్ సీదాగా సోదా చేసే
కనిష్టీపులు మా కడుపులు-

కడుపు లోపల ఎసరు
పిడికిటలే దొక్క పిసరు
ఆ యెసరు బుసబుసలు
మా గుండె గుసగుసలు
నీ యొడద దడదడలు
హి హి హీ బహువ్రీహి
చావల్ నహీ ! నహీతో—

అదుగో జనతా వాక్యం ఆప నకశ్యం
అది అన్య పదార్థ ప్రధాన భవదైశ్వర్య
సమాసానికి విగ్రహవాక్యం

—(స్వతంత్ర, 26-3-54)

# దీపావళి

ద్యా వాధ్యాసిత శక్ర కార్ముక కళాకాకార కిమ్మీర రే
ఖా వర్చః పరిభావి దీపకళికా కాంతి ప్రసారంబు ది
గ్దేవీ మంగళహారతిం బలె సెలంగెన్ బాణసంచాల శ
బ్దా వృత్తుల్ నిశ కిడ్డ పీడ్కోలుపునన్ బాజా భజంత్రీలుగాన్.

నలుగడల రంగు రంగుల
వెలుగుల్ వెదజిమ్ము దీప వితతుల వలనన్
కలవారల మేడల నీ
డలు పడుచుండె నిరుపేద తావుల మీదన్.

దివ్వెల పండుగ యని కడు
క్రొవ్వెక్కిన గొప్పవారి కుర్రలు తారా
జువ్వలు రువ్వగ పంబిన
నెవ్వగ తాటాకు టిలు గుణించును టాటాల్.

# స్వాగతం

తల నరసిన తను వొరసిన
వయసు మళ్ళని మనసా !
అభినవ యౌవన భావనలో
ప్రణయానుభవ ప్రస్తావనలో
విరహాగ్ని మహీధ్ర శృంగాల్లో
శృంగారధునీ తరంగాల్లో
ఆశా విహాయస వీధుల్లో
అగాధ స్వప్న సమాధుల్లో

మసలి మసలి విసుగెత్తిన
మనసా !
విసర్గములు నీ కోర్కెలు
విసర్గములు కావు సుమా !
మనసా !
కొనసాగను బోవు సుమా !

# తృప్తి

పాడు దేహం పది పదేడులు
బ్రదికినందుకు ప్రయోజనం !
కాలే దాక ప్రియ కాంతామణి
కౌగిటిలో సుఖభాజనం !

పాడుకన్నులు చూడలే దాక
శతశాత సుందర రూపం !
పాడు గొంతుక పాడలే దాక
ప్రణయమయ గీత కలాపం !

పాడుపెదవులు త్రాగలే దాక
మధురాధర మరందకణం !
పాడు మనసు తృప్తిపడలే దీ
శతాబ్దాల బ్రతుకులో
ఒక క్షణం !

# సినీవాలి

(ఒక అతి వాస్తవిక కవి పగటికలల పలవరింతలు)

దయమాలిన ప్రియురాలికి
పిచ్చెత్తిన ప్రియుని పిటిషను-

హలో మై డియర్ మేమ్ !
నా పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ !
నా కూటికూరా పౌడర్ టిన్ !
నా పార్కర్ ఫౌంటెన్ పెన్ !
హలో నా లోమా హెయిరాయిల్ !
నా ప్రేమ పంజాబ్ మెయిల్ !
నా డిలైట్ఫుల్ బెడ్రూమ్ లైట్ !
నా నూత్నాతి నూత్న కవితా న్యూ
హనీ మూన్ నైట్ !

నా కూరిమి మా లోకం
కాక్టెయిల్ మైకంలో
నా కోర్కెల కేటలాగుపై
కాపీరైటు లాగ
నమ్ముకున్నాను నీ ప్రేమను-
ఇంతలో ఎంత దగా !
ఎవడో ఒక కశ్చనతో
నాకన్నా నాలుగాకు లెక్కువ
చదువుకున్నాడని కదూ

ఏరి కోరి గప్‌చిప్‌గా
పెళ్లి చేసుకున్నావు!
కటకటా!
వా డెవడో నే నెరగని
వాడయితే కొంత బాగు!
ఆ మధ్యను తన చెల్లికి
ప్రేమలేఖ వ్రాశానని
చెడామడా నా చెంపలు
వాయించిన వెధవ వాడు!

పోనీ వాడంటే మోజుపడితే పడ్డావు
కాని అచ్చివచ్చినవాడిని నన్నెందుకు కాదనాలి!
చదువుకున్నదానవు
చలంగారి కలం పదును బాగా చూచినదానవు
అప్పుడె కొంప మునిగి పోయినట్లు
పెళ్ళెందుకు చేసేసుకున్నావు?
చేసుకుంటే చేసుకున్నావుగాని
పెళ్లయిపోయిన మర్నాడు
అరెస్టు వారంటులాగు, బర్తరఫ్ తాఖీదులాగు
నా కా శుభ లేఖేమిటి!
ఎంత ఘోరం! విడ్డూరం! రసాభాసం! సాహసం!
ఏమిటి నీ ఉద్దేశం?
నే నింకా బతికున్నానో
లేక నువ్వు లేకపోతే
చనిపోతానని యెపుడో

కాలేజీ యువ లవర్సు
మాదిరిగా మామూలుగ
మాటవరస కన్నానని
ఆచోద్యం చూడ్డానికో ! .
అంతపనీ చేసివుందు
నయితే ఒక చిన్న శంక-

నేను గాని చచ్చిపోతే
మరి నా మనస్సులో
పేరుకుపోయిన ప్రేమంతా
ఏమయిపోవాలి చెప్పు !
నాతో పాటు అదికూడా
చనిపోవడ మన్నది
ససేమిరా నా కిష్టంలేదు
ఏం చెయ్యమన్నావు అది నా దౌర్బల్యం !
అందుకనే నేనింకా
మందులు కూడా సేవిస్తూ
నిక్షేపంగా బతికున్నాను.

నే నింకా బతకాలనే నీకుంటే వెంటనే
మీ మరదలు మీనాక్షికి
నా కేసు సిఫారసు చెయ్
నా వలపు సలుపు నివారించు
దాని కేదో ఒక దారంటూ వుండాలిగదా !
అందుకు మార్గదర్శినివి మహర్షితుల్యవు నిన్నేఆశ్రయించాను
'సిద్ధి ర్భవతు మే సదా'

ఇన్నాళ్లుగా నిన్ను నమ్మకంగా
ప్రేమిస్తూ వచ్చినందుకు
ప్రేమ పేరిట నే చేసిన సేవకు
నువ్వు నా కిచ్చే 'ప్రోవిడెంటు ఫం' డనుకో- అది !

నీ ప్రియుడిగా ఆక్టింగు చేసి
హఠాత్తుగా ఊస్టింగయినా, అనుకున్నట్లు జరిగితే
అది ప్రస్తుతం నా ఉద్దేశంలో
నా ప్రేమ సర్వీసులో ఒక పెద్ద ప్రమోషను !
బుట్టదాఖలా చెయ్యకు నా పిటిషను !

# 'ఆరిందా'

ప్రాయముతో స్మరార్చన పరాయణమైన మనస్సుతోడ నా
ప్యాయముగా రతిస్మృతి రహస్యగతి ప్రతిపాది గ్రంథ పా
రాయణ చేయుచుం బవలు రాత్రులు బుచ్చితి కూచిమార వా
త్స్యాయన కామసైగమ రసాయన పానమె జీవనమ్ముగన్.

కాయము దమ్ములున్నదనుకన్ రతిరాజ పరాజయంబు కా
నీయక కట్టుదిట్టముల నెప్పటి కప్పుడు చేయు జాణనై
ప్రేయసి యొంటిపై చెమటబిందువు నైతము సెంటువాసనే
వేయు నటంచు నెంచు రసవేత్తల పొత్తులు చిత్తగించితిన్.

భావ ప్రోద్భవ మారభద్ర భవన ప్రాకార నీకాశ మ
న్నీవీ బంధ ముముక్షులై కవులు మన్నీలున్ మహారాజులున్
దేవాజీవులు యాయజూకులును నేతేరంగ నా ప్రాయమున్
యావన్మందికి నొక్క రాత్రి రతి పిండైనట్లు వడ్డించితిన్.

నా లాస్య కళా నైపుణి
నా లావణ్యపు నవనవ నశియించెను నా
కాలమునా దేలమునా
దేలాగుంటినొ వచింప నెట్లగు నిపుడున్.

ఆ రోజులలో నాతో
ఊరూ రవి పోరిపోరి యుద్ధతులై యు

న్నా రదె మా యూర కవుల్
వారే సాక్షులు మదీయ ప్రాగ్వైఖరికిన్.

సామాన్యపు కవులును నా
తో మార్గాన్న యనుభవముతో ధీమాగా
క్షేమేంద్రుని డీకొనగల
ధీమాన్యులు నగుచు నారితేరిరి కృతులన్.

# సువర్ణ శృంఖల

చలికాలము శాలువలో
నులివెచ్చని కలవచ్చెను
నాకు
డాక్టరేటు వచ్చినట్లు
నే డకోటా నెక్కినట్లు
పైపై చదువులకని
పరదేశం వెళ్లినట్లు
తిరిగివచ్చి స్వదేశమున
ఒక
విశ్వకళా పరిషత్తున
ప్రప్రథ మాచార్యపదవి
నధిష్ఠించి యున్నయట్లు
నెలనెల కొక సంచీ కరు
కులు గలగల లాడినట్లు
నాకోసం
బీచి ప్రక్క బగీచాలో
కారుషెడ్డు తరవాయిగ
తయారైన బంగ్లాలో
శ్రీమతితో చిల్లరతో
క్షేమంగా ప్రవేశించి
నిక్షేపంగా కాల
క్షేపం చేస్తున్నయట్లు—

మరుక్షణ మొక దొరసాని
పరదేశ ప్రవాసాన
మా కాతాపద్దు నిశాని
వచ్చినట్లు
నాపై నొక అభియోగం
తెచ్చినట్లు
కలవచ్చెను చలివేసెను
తెలివొచ్చెను తెలవారదు
తలపుల నటు నిలబెట్టెను
కల సువర్ణ శృంఖలయై.

# అనుభవ శాలి

పాప మతండు చిన్న బడిపంతులు - అందును ఆంధ్రభాష క
ధ్యాపకుడంట! చెప్పవలెనా యిక నాతని పాట్లు! ఉల్కు డా
బాపని మాట కొక్కు బడి పాపడు; పెండ్లము పెందరాళ క
ళ్లాపును జల్లబోవదు; తొలంగరు దారి పరాయి దారలున్.

ఇల్లా యిర్కాట మాలు మర్కాటము, పోనీ పాడియా పంటయా
ఇల్లే! ఆస్తియు పాస్తి నాస్తి, మరి యా యీ చుట్టముల్ జాస్తి. ని
ల్వెల్లం జిల్లులు వడ్డ వాలకము, ఊరెల్లం బదుళ్లయ్య యో
పిల్లల్ బోలెడు జీతబత్తెములు కాఫీ కర్చుతో ఫైసలా!

పేచి పూచీలు పడుగును పేకయైన
అతని సంసారపుం జాపునం దమర్చె
నాలు సంతు పైటంచుగా - అక్షరాల
అర్థ నారీశ్వరంబయ్యె నయ్య బ్రతుకు.

అతడు సీసాలతో ఆసుపత్రి వయిపు
సంచితో రేషనింగ్ షాపు వంక
నడచుచున్నప్పుడే నాడియన్న దసలు
అతనిలో ఆడుచున్నట్లు దోచు

అతని కీయ రెవ్వరు నప్పు నరువు నెరువు
తిరిగి యీయలే డత డిన్ని తిలలనైన
తగిన యనుభవ మొకటి యాతనికి గలదె
గట్టిగా పీల్చిన పొడుము పట్టు దక్క.

# ఎందరో మహానుభావులు

ఎన్నిక లివి
మంత్రిపదవి మన్నిక లివి
తంత్రజలధి కన్నిక లివి
ఇవే కదా
నవజీవన నగరానికి
　　పొలిమేరలు!

ఇవేకదా
నిజాభ్యుదయ నిశ్రేణికి
　　తొలి మెట్టులు!
స్వతంత్ర జీవిత మబ్బిన
　　గత వత్సర చతుష్టయపు
సుతి మించిన మతిభ్రమణ
　　సుతరామూ స్మృతిలేదా?
యువకులార! వృద్ధులార!
　　వృధా రుద్ధ బుద్ధులార!

ఏమరకం దేమరకండి
ఒస్తున్నా రొస్తున్నా
రొక రొకరే ఓట్లడిగే
ఓట్లడిగే తగు మనుషులు
తగు మనుషులు తథాగతులు
　　అభాజన సభాపతులు!

ప్రభుత్వ పద శుభాక్షతలు
మీ ఓటులు.
తమ హేటులు మీ బూటులు
తాకుగాక !

తమ రుమాళ్ల చెమటలతో
తడియుగాక !
తమ యుక్తులు సమయోక్తులు
మరామరా !
నమ్మవద్దు నమ్మవద్దు
ససేమిరా

ఎగాదిగా చూచి దగా
తొందరపడ కుందురుగా
'ఎందరో మహానుభావు
లందరికీ వందనాలు'
మన వశమా !

—(సమీక్ష - డిసెంబరు, 51)

# చక్షు శ్శ్రవాలు

మాకు

వినిపిస్తాయ్ వినిపిస్తాయ్
ఇనప్పెట్టె వెనకాతల
సిరిగజ్జెల ఝుళంఝుళలు

కనిపిస్తాయ్ కనిపిస్తాయ్
రవసెల్లా రాపిడిలో
ధనిక మిథున దంభ రతులు

వినిపిస్తాయ్ వినిపిస్తాయ్
జంగం దేవర లింగకాయలో
మార్మోగిన గుడిగంటలు

కనిపిస్తాయ్ కనిపిస్తాయ్
సినిమాలో శివదేవుని
అభయహస్త శుభముద్రలు

వినిపిస్తాయ్ వినిపిస్తాయ్
లాయడ్స్ బేంక్ ముం దాగిన
రోల్స్‌రాయ్స్ మోటార్ హారన్స్

కనిపిస్తాయ్ కనిపిస్తాయ్
లేజీ కాలేజీ లేడీ స్టూడెంట్సు
వెస్టెండ్ రిస్టువాచీ రేడియం డయల్స్

మీకు

వినిపించవ్ వినిపించవ్
 బ్రదుకంటే భయమేసిన
 ముదుక భిక్కు మూలుగులూ!
 పడిపోయిన గుడిసెల్లో
 పగిలినట్టి పిడతల్లో
 ఉడుకు గంజి కుతకుతలు

కనిపించవ్ కనిపించవ్
 నడి బజారులో నడిచే
 శ్రమజీవుల చెమటబొట్లు!

అవి
 సాక్షాత్-చక్షుశ్శ్రవాలు
 పడగెత్తిన పొరవిడిచిన
 పసిపట్టిన కసిగట్టిన
 పాముల చెరలాటలు!

ఇక
కలవారల-
 సొరకాయల బూరాలకు
 కలగిపోవు తలత్రిప్పవు
 ఖబడ్దార్!

—(సమీక్ష - మార్చి. 51)

# నష్ట జాతకులు

చరిత్రనంతా చాలాసారులు
చదివానంటే సరిగాదోయ్

నిజానిజాలూ నీకే తెలుసూ
మజాకాలా మన మన గొప్పలు !

చరిత్రకారుల చతురోక్తుల్లో
ఎన్ని కోతలో ఎవరికి యెరుక ?

చరిత్ర యంటే ఒక నిర్వచనం
సమరాలూ + సమాధులూ.

దాడీవాలాల్ దండయాత్రలూ
అలంఘీరుల లడాయ్ బడాయీ

అహంభావ స్వయంభువులు
అహంకార నిరంకుశులు
సేనాపతి సైతానుల
తరిఫీదుల జబర్దస్తీ

శుద్ధాంతాల్లో సుఖాలు మరిగిన
శ్రీమంతుల సిద్ధాంతాలూ
సామంతుల రాద్ధాంతాలూ
ఏమైనా యాదస్తుందా ?

తరతరాలుగా మన దేశంలో
పరాయివారే పరిపాలకులూ
మనమంతా పరిపాలితులం
మన సొమ్మంతా వారి ఖజానా
మన స్త్రీలంతా వారి జనానా

ఇరుగు పొరుగుల ఇద్దరు రాజులు
రచ్చకెక్కిన రణరంగాల్లో
చచ్చినదెవరూ ? సామాన్య ప్రజ-
వచ్చినదేమిటి ? లబోద శంఖం-
మాటిమాటికీ మత ప్రవక్తలు
ఏం బోధిస్తే ఏం లాభం ?
వారి గుండెలే తుపాకి గుండుల
బారికి గురిగా బ్రద్దల్ జేశాం

చాలు చాలు మన చరిత్ర ప్రతిభలు
అడక్కు మా గతిమాలిన బ్రతుకులు
దౌర్భాగ్యపు దామోదరులం !
పదహారణాల పరకింకరులం !
ఉభయపక్ష ప్రభువుల
అభిచార హవిస్సులం !

అనేక యుద్ధాల్లో ఆరతేరిన
ధీరోద్ధత నాయకులం !
కాని వీరస్వర్గపు చిరునామా
కనుగొనలేని అమాయకులం !

భేరీ మ్రోతలు ! గోరీ నీడలు !
దారిద్ర్యపు రుద్రభూమి రగిలిన చితుకులు !
కలవారి పులిస్తాృికుల కంటిన మెతుకులు !
కాలదోషం పట్టిన పత్రాల్ మా బ్రతుకులు !

—(సమీక్ష - అక్టోబరు, 51)

# గడియారాలు

(జెనీవా శాంతి సమావేశాల నుద్దేశించి)

గడియారమ్మల నడి యంగడిలో
ఒంటరిగా నొక గంట స్తంభం
ఆ స్తంభముపై
ఆద్దమరే యొక గద్ద వ్రాలినది
గడియారమ్మలు గడగడలాడేయ్.
తద్దోషము తక్షణమే
వర్జించాలని తర్జన భర్జన-
అంగడి బందైనది
తెరుచుకుంది
దొంగ దుకాణం దొడ్డివేపు
దోషం దోషం చర్చ సశేషం

ఆ దోషానికి
కాలదోష మాసన్నమైనది
కీలు బడలిన గడియారాలు
గోల పెట్టినవి
వడి గల గడియారా లది
సీల సడలిన వాచీల పేచి యని
వాదించినవి.

ఎట్టకేల కెల్ల గడియారాలు
చిట్టచివరి సమావేశం చేశాయి

పంచకల్యాణి

తీర్మానంపై తీర్మానం
పర్యవసానం గంగాస్నానం
గడియారా లొక్క గడియ
ఆత్మవిచారం చేసుకొన్నాయి
ఏ రెండూ ఏకీభవించవు
గుడగుడ శబ్దం కుండకు నష్టం
గాడిద గుడ్డూ గరుడస్తంభం
గంటస్తంభం పడగొట్టిందని
గడుగ్గాయి గడియారాలు
గద్దలుగా మారిపోయి
గగనాని కెగసిపోయినై.

రా-వి

# ధర్మసందేహం

అందరూ ఎందు కిలా బతికేస్తున్నాగు ?
బతకలేక బతకలేక చస్తున్నారు ?
తమని కనమని దరఖాస్తు పెట్టని
పిల్లల్నెందుకు కని పారేస్తున్నారు ?

చూజూస్తూ
ఏడాది కొక ఎండాకాలం
కాలానికో బంగనపల్లి
కొనుక్కొని పిసినిగొట్టు-
అజీర్తి రుజార్తుడైన ఐశ్వర్యవంతుడు-
రసికత్వం చచ్చిన రాతి జాతిలో
ఉస్సూరుమని పడియున్న కవి-
ఆసుపత్రి కక్కుసులో తన సెక్సు అక్కసు
తీర్చుకొనే కక్కుర్తి ముండకొడుకు-
పంకి తోకలా పని యెడతెగని
ఏ నెల కానెల ఇంటద్దె నిచ్చుకోలేని
ద్వాదశి నాడూ పస్తుపరుండే గుమస్తా-
కూతురు పెళ్లికి, పెళ్లాం పురిటికి, తన దినవారానికి
పదిడబ్బులు బదులుపుట్టని బడిపంతులు-
ఆ పూట సాపాటుకు గతిలేక
ఆకలి నూకాలమ్మకు నిట్టూర్పు లుపారం పెట్టే
ముష్టివాడు కుష్ఠురోగి
అష్టదరిద్రుడు కష్టజీవి

## పంచకల్యాణి

అందరూ ఎందుకిలా బతికేస్తున్నారు ?
ఉట్టికి ఎగఁబ్రాకలేక-
ఉరిబోసుకు చావలేక-

తిరపతి మొక్కులు, తీర్థయాత్రలు
లాటరీలు, బైరాగి చిటికెలు
లకోటా ప్రశ్నలు వగైరా
ఎప్పటి కప్పు డేవేవో ఆశల రాకపోకలై
రేపుమాపుల చూపురేకలై
ఎలాగో ఒకలాగు దినం దిబ్బ జేరుతుంది.
ఏముందీ బ్రదుకు బండారం-
సుఖంలేని సంసారం
చుప్పనాతి శృంగారం
నంగనాచి నయగారం
పేచీ పూచీ పడుగూపేకై
సంసారపు చాపు తయారై
అమాయికుల నందరినీ
కట్టబెట్టి కాదు చుట్టబెట్టి
చావనీక బతకనీక
ఏవేవో ఎండమావులను కలిపిస్తుంది
గొంతు తడారేవేళ కంతా గొల్లుమంటారు
గజేంద్రమోక్ష ఘట్టం ఘట్టమంతా ఏకరువుపెట్టినా
కరివరదుడు కరుణానిధి యెవడూ కనిపించడు
కనిపించే ప్రభువాకడూ కనికరించడు
అందరూ ఎందు కిలా బతికేస్తున్నారు ?

# పరమపద సోపానపటం

పరమపద సోపాన
పటములో గడులెన్ని ?
గడులలో గలయట్టి
నిడివి నిచ్చన లెన్ని ?
పడగదాచిన గడుసు
పాము లక్కడ ఎన్ని ?

మెదడున్న జంతువుల
బ్రదుకెల్ల బంధాలు
అడుగడుగునా ఆశ
లంతలో నిస్పృహాలు

పట్టాలు, బిరుదులూ
పరదేశ యానాలు
పెదపెద్ద హోదాలు
పెండ్లి పేరంటాలు
చుట్టాలు, విమర్శకు
లధికార్లు, చట్టాలు
వట్టి ఆచారాలు
వగైరా వగైరా.

★

ఇవియేనా నవజీవన
నగరానికి పొలిమేరలు ?
ఇవియేనా నిజాభ్యుదయ
నిశ్రేణికి తొలిమెట్లు ?

రాజా

ఇవియేనా ఇంత మహా
మేధావుల భుజకీర్తులు ?

ఈ నిచ్చెన లింత పిసరు
ఎడమిచ్చిన పడిపోతాం
అదిగో ! అట్టడుగున
పగబట్టిన పాపారాయుడు
అరిషట్టుల కాదివిరాట్ !

★

అతని ప్రేవులు
ఆవులించీ
అతని పైత్యం
ప్రకోపించీ
అతని పడగలు
అతని కోరలు
అతని లాలా
జలగ్రంధులు
బిర్రబిగిసీ
అతని అంగుడి
గడియలన్నీ
పుడమినంతా
బిడాయిస్తే
మన పునర్జన్మాధికారం
మానవ ప్రథమావతారం !

—(సమీక్ష - నవంబరు, 51)

# హాయాంగుహా

వర్తమానపు వాస్తవలోకం
కిటకిటలాడే మనుజానీకం
అధికార పరాయణుల దివాణం
ధనాధిక చిరాయువుల దుకాణం
కష్ట సుఖమ్మల రంకుల రాట్నం
ప్రాతా క్రొత్తల సంకుల సమరం
స్వేచ్ఛాజీవిత లోహ శృంఖల
వాంఛారించోళికి వధ్యశిల

ఈ

జగన్మహేంద్ర జాలంలో
మత పాతాళపు లోతుల్లో
ధర్మశాస్త్ర జలపాతాల్లో
పడి
మరణించే అనాథ ప్రేతల
మరువబడే అగస్త్య భ్రాతల
అస్రాశ్రులు
హాలాయుధుల భగీరథుల
ఆయుస్సులు
కలగలసిన కట్టతెగిన
హోరెత్తిన హాయాంగుహా!

రాజ

నీ రాకలు
శ్రీపతి పద శిలోచ్చయము!
నీ పోకలు
ఆదిభిక్షు శిఖాశయము!
నీ లోతులు
లోకాంతరముల సారంగాలు!
నీ ఘోషలు
మృత్యూద్ధత మృదంగాలు!

ఓహో!
హాయాంగుహో! హాయాంగుహో!
త్వర త్వరగా పరువెత్తుము
ప్రపంచాన్ని ముంచెత్తుము
ప్రళయం రావింపుము
పునస్సృష్టి కావింపుము
ఓహో!
హాయాంగుహో! హాయాంగుహో!

—(సమీక్ష - ఏప్రిలు, 51)

# నిజము

ఋషి నెరుగని పుట్టుపూర్వోత్తరముల
జ్ఞానమా లేదు- లేదు జిజ్ఞాసయైన
కన్నతల్లి కడుపునుండి కాటిదాక
నాదు జీవితపుం బ్రయాణమ్ము నిజము !

కాల కూలంకషావర్త గర్భమందు
బుంగవలె పొంగి పొంగి బుడుంగుమనెడు
బ్రదుకు బ్రదుకుట కింత సంరంభమేల ?
మరణ మెప్పుడో తప్పని మాట నిజము-

కడచు రాబోవు జీవిత ఘటనలందు
మరపునకురాని మధురాతి మధురమైన
కలలు కాంక్షలే గాని సుఖమ్ములేదు
ఎల్లి నిన్నలు కల్ల- నేడే నిజమ్ము-

—(ప్రవాసి దీపావళి సంచిక, 1950)

# కాళరాత్రి

చల్లచల్లగ సంసార సాగరమున
నడచు నా భగ్న జీవిత నౌకనుండి
వంగి చూచితి నొకమారు వనధివంక
విధి విలాసమునకుఁ జాల విస్తుపోతి.

కడలి తరగ లుయ్యాలగా కళుకు లూపి
మొగిలి మొవ్వల దాగుడుమూత లాడి
యెందు జూచిన దోచిన చందమామ
వెడలిపోయెను నా కంటి వెంటనంటి

క్రింద జూచిన కెరటాలు కేలు సాచు
మీద జూచిన మేఘాలు మ్రింగివైచు
క్రిందు మీదులు జూచుట కింక తడవు
లేదు ; లేదిక ఆశ లేశమైన

ఆ నితాంత నిశా నిబిడాంధకార
భీకరాకృతిలోన నేకాకినైతి-

చుక్క లొకదాని నొక్కటి చూచుకొనుచు
కటిక చీఁకటి చెరసాల కటకటాల
శిశిర శీతల వాతూల శృంఖలముల
నన్ను గని యేమొ నవ్వుచున్నట్లు దోఁచు

వేడి నిట్టూర్పు గాడ్పులో కోడికూత
వేఁడి కన్నీటిసోనలో వేగుజుక్క-
నాకు వినిపించె కనిపించె నంతలోనె
కడచెఁ గాఁబోలు జీవిత కాళరాత్రి !

మృత్యుదేవత నా ప్రియ మిత్రమనుచు
మరచిపోతిని నే నెంత మందమతిని.

—(ఆంధ్రపత్రిక విరోధి సంవత్సరాది సంచిక. 1949)

# ప్రాయోపవేశము

అనఁగనఁగా నొకానొక మహాకవి అద్యతనాంధ్రసాహితీ
వనమున వాసమున్న రసవన్నవ కావ్య కళాతపస్వి ఆ
యన బ్రదుకెల్ల నొక్క కలయై కడతేరెడువేళ త్రెస్సిపో
యిన యుసురుల్ బిగించుకొని యిట్లను మృత్యువుతో ముఖాముఖిన్

అతివేల ప్రణయోచిత ప్రియసఖీ సాకూత సంహూతి యే
బ్రతుకుం బొంగలిమై స్వకీయ కవితా ప్రస్థాన పాథేయమై
గతిగల్పించెను నా మనుంగడ కదే కాబోల్ ! విపర్యాస సూ
నృతమై నీ పిలుపై యివేళ వినిపించెన్ మిత్తి మిత్రోత్తమా !

నా హేరాళకళాకనత్కవన గంధర్వావరోధమ్ము నం
దీహాదోహల నిత్యనూతన మధూహేరమ్మదవ్యూహమం
దోహో ఎన్ని విచిత్రమైన రస విద్యుద్విస్ఫులింగాల్ ! సిసృ
క్షాహం వీర పరాక్పపేటము లవే కాబోలు ! రప్పించె నిస్ !

తెనుగు బొలమ్మునం బొడమి తీయని కైతలు చెప్పిచెప్పి చ
చ్చిన తరువాతగాని యల శిష్టులు మెచ్చరుబో ! కనీస మిం
కను మన షష్టిపూర్తియును గాదుగదా యెటులోర్తు రందుచే
తనె నినుఁ దోడుకమ్మని యథావిధి నయ్యెద గీర్తిశేషుడన్.

గురువుగారికి జన్మ మఱియొండు గలదేని
చెల్లింతునంటి దక్షిణ ఋణమ్ము

శిష్యు నాకుం గాక శ్రీమంతు నొకనికి
కృతి యిచ్చికొనుమంటి ప్రతిఫలమ్ము
గ్రంథ ప్రకాశకు గైకొనుమంటి నా
కావ్య ప్రపంచమ్ము 'కాపిరైటు'
ఆలుబిడ్డల కవి నాశ్రయించుటయెల్ల
'కటకటా మీ పూర్వకర్మ' మంటి
అనుచు నూపిరి బిగబట్టి యంత నుడిపి
కడగి తన యప్పగింత లేకరువు పెట్టి
అంపశయ్యపై భీష్ముని యట్లు కూరు
చున్న కవిఁ జూచి మృత్యువు నుస్సురనియె.

(భారతి - సెప్టెంబరు, 51)

# మరణ వాఙ్మూలం

స్మశానంలో నా సమాధిపై
మలయమారుతం వీస్తుందట !
మాయావిడ నా పేరట
సత్ర మొకటి కట్టిస్తుందట !
కోడలికో కొడుకు పుడితే
నా పేరే పెడతారట !
అల్లుళ్లందరు మూడు రోజులు
పక్షిణీలు పడతారట !
అభిమానులు జరుపుతారట
సానుభూతి సభలు !
శిష్యులు కొందరు చిత్రపటా
విష్కరణం చేస్తారట !
కవిమిత్రు డొకడు కావ్యంవ్రాసి
నా కంకిత మిస్తాడట !
తద్దినాల పురోహితుడు
మూడుతరాల్
నా నామం సంకల్పిస్తాడట !
నే చస్తే
వీళ్లంతా విచారిస్తే
చాలా సంతోషిస్తా నేమాత్రం !

(జీవిత సమరంలో పరాజితుడైన ఒక మహా వ్యక్తి మరణవాఙ్మూల మిది)

—(స్వతంత్ర, 28-4-50)

# ప్రళయ లయం

సృష్టికి
    సుఖముష్టికి
అసంతుష్టి
    తను యష్టికి
పాపిష్ఠికి
    పరమేష్ఠికి
తగిలిందట !
    వికట భ్రుకుటీ ప్రకట
    విరూపాక్ష రూక్షదృష్టి-
రగిలిందట !
    ప్రళయ రౌద్ర రసహాసంతి
పగిలిందట !
    పరమాణువు
పగిలిందట !
    పరమాణువు
అణువణువున
    వణకిందట
కుడి యెడమల
    నడిమింటను
మృత్యుంజయు
    ముంజెకన్ను
హాలాహల
    కోలాహల మదిగదిగో !

నా

అవిగవిగో
　　వృషభధ్వజ భుజకీర్తుల విషవాంతులు-
సృష్టిపదము చీమ కుట్టై
　　శివునికె సివ మెత్తెను
తప్పటడుగు తాండవమై
థకిట థకిట తథిగిణ తోం
లయపడ్డది నవబ్రహ్మ నడ్డిమీద-
భళిభళిరా మానవుడా
భయపడకోయ్ లయధ్వనికి
నీసృష్టి ప్రతిష్ఠ లిక
　　నిలబడవని భయపడకోయ్
నిలుస్తుంది నీసంతతి
　　విశ్వాసం - నీ - విశ్వాసం నిజమైతే
కల్లైతే కానీ యొక వల్లకాడు
'సృష్టంతా యొక సుఖవ్యాధి
సగంసుఖం సగం నీ మొఖం !
అరసున్నా - కన్నా -
　　నెరసున్నా నెరవేకద !'
అని యొక తత్త్వవేత్త తరహా !
'చేతనైతే,
　　శేముషిదీ చెలువముదీ
వాటా కేటాయించు
　　పునస్సృష్టి బనాయించు'
అని యొక శాస్త్రవేత్త సలహా !

—(స్వతంత్ర)

# 'సిద్ధిర్భవతు మే సదా'

భావకవి కట్టిన
    ఊహా కలాపంలో
భామవేష మెప్పటికీ
    తెరవెళ్ళదు

ఆవేశ నిరంతర
భావ పరంపరలో
అసలు పుసికిపోవచ్చును

ఆలోచనా సులోచనాలతో
మనోనయనామయము
    శమిస్తుంది.

ఆనా డాదికవి భావయిత్రి
అకస్మాత్తుగా
కావ్యవాణీ కలగానమై
రసవిషాదస్వర మందుకుంది
శోకము శ్లోకమైనది మొదట-
కాని - రామాయణ కావ్యరచన
ససమాధికమై సాగినదే

ఆలోచన
నవనీతము
కవి యంతస్సారభూత

మా వేశము
విద్యుల్లత
హృద్యగపద్వికస్వరత

ఆవేశము
భావుకాత్మ కూపులాట
ఆలోచన జోలపాట
ఊపుట నాపుటతో
ఊగుట యాగదుగా
అది - కావ్యపఠన కడపట
మిగిలే రసధ్యాస

పాట మధ్య మగత పట్టు
నదియే రససిద్ధి కదా !
'సిద్ధిర్భవతు మే సదా'

—(స్వతంత్ర. 18-6-54)

# ఫలశ్రుతి

'ఇచ్చట నీ వివిక్తమున నింత ప్రసాదము నాత్మఖేద పా
టచ్చరమైన పానకఘట మ్మొక కమ్మని పద్యకావ్యమున్
నిచ్చలు గీతిబంధముల నేర్పెలయించుచు నీవు నున్నచో
నచ్చముగా వివిక్త మువిదా! అవిముక్తముగా నగుంగదా!'

కవియు కళాప్రియుండు రసికప్రవరుండు మహాప్రవక్త శా
స్త్రవిదుడు యద్భవిష్యక యశస్వి ఖయాము వచించినట్లు మా
నవ భవయోగసార్థకతనా నవురత్ - షరబత్ - రుబాయతుల్
దవులుటగాదు భవ్యకవితా భవితవ్యము కల్గకుండినన్.

కాంతాసమ్మితమై రసాసవనిసర్గస్వాదువై ప్రాస వి
శ్రాంతి చ్ఛాందసవృత్తి రీతి కలనా ప్రాగ్భారశయ్యాసుధా
చాంతిన్ గానకళాభ్యుపాసన కుషస్సంకల్పమై కావ్యమా
కాంతాది త్రితయప్రధాస్పద ముమర్ఖయ్యాము వాకొన్నటుల్.

మతిగల జంతువైన నరమానవు డొక్క శతాబ్దిపాటుగా
బ్రతికిన పాశవాశయ పరశ్వధమై ఉమరూక్తధన్య జీ
విత మధురప్రబంధరస విశ్రుతమై స్మృతిసిద్ధమై ఫల
శ్రుతి పలికించు నొక్క యపురూపకృతి శ్రవణానుభూతియే.

మధురాక్కర

సోమపాన మ్మొనర్చు ఋషుల సామగానమ్ములో
కామగమనమ్ము నేర్చిన కవి కళాభ్రమణమ్ములో
నేమిటో గోచరించిన దేకవాక్యత ; కవిత
నోమునోచిన రసికుల నోముచుండును గావుత !

—(భారతి. జులై. 53)

# పంచకల్యాణి

పరుగెత్తిపోతోంది నా పంచకల్యాణి
గడచింది స్వానుభవ ఘంటాపథ శ్రేణి

చలంగారి కలంకంటె
బలవత్తర శక్తియేదో
కశాఘాత కర్షణమై
ప్రేరేచెను—

బ్రదుకంతా బాధ్యతలై
అవకాశము లవలేశము
కనుపించని కాలంలో
సకిలించెను—

ఇవిగివిగో
నాయూహా హయహేషలు.

పురాప్రపంచపు సరిహద్దులలో
మరో ప్రపంచపు పొలిమేరలలో
అప్పుడప్పుడా డెక్కల చప్పుడు
అక్కడక్కడే కదం, పదంపడి
యెదుటికి పదమని హెచ్చరిక
అది ఘంటాపథ మిది శృంగాటక
మెదిపడితే అది ఎకాయెకి.



—(స్వతంత్ర. 16-4-54)

# మన్వంతరం

(ఊహాప్రహేళిక)

1957 డిసెంబరు 31
అర్ధరాత్రి
ఏకాంతంలో—
అమాంతంగా
ఆశావైహాయస వీథుల్లో
అగాధ స్వప్నసమాధుల్లో
విరహాగ్ని మహీధ్ర శృంగాల్లో
శృంగారధునీ తరంగాల్లో
లేనిపోని ఊహావిహారాలు చేసి చేసి
విసుగెత్తి ఇటీవలే కాస్త
చిత్తం స్థిమితపడ్డ
భావకవి అంతర్వాణి శర్మ
అంతర్ముఖుడై
దివినుండి దిగివచ్చి
భువి భవిష్యత్తు చిత్తగిస్తున్నాడు—
దృష్టి తీవ్రంగా సారించాడు
ముప్పైఫైయేళ్ళు ముందుకి లగెత్తేడు.

* * *

అతను పైలా పచ్చీసులో కేవలం భావకవిగానే ఉన్నప్పు డతని దర్శనం అస్పష్టంగా వున్నా భూతం భూతంలా, భావి దేవతలా కనిపించేవి.

ఆ భావకవి కట్టిన ఊహాకలాపంలో
భామవేష మెప్పటికీ తెర వెళ్ళకపోడంతో
ఈమధ్య కా_స్త స్థిమితపడ్డాడు.
క్రాంతదర్శనుడుకూడా అయ్యేడు
అతని కిప్పు డిప్పుడే
ఉత్తుత్తి ఊహాపోహలు తగ్గి
ఉన్నదున్నట్లు కన్నులకు పొడగడుతోంది లోకం.
తనబుద్ధిని అనుభూతిలో పుటంపెట్టి స్ఫుటంచేశాడు.
అవశ్యంభావి జగత్పరిణామ స్వభావంకూడా
అతని కిప్పు డిప్పుడే
లీలగా గోచరిస్తోంది.
లీలగా కాదు అవలీలగా—
పరిణామ స్వభావమే కాదు
పరిణామ పరమార్థం
పరమార్థ పరిణామం
పరిణామ పరిమాణం
పరకోటి ముట్టిన పరిస్థితికూడా గోచరించేసింది.
అతను పరమాణువు పగుల్తుందనీ,
'మహాప్రళయం జగంనిండా ప్రగల్భిస్తుం' దనీ
ఎప్పుడో జోస్యం చెప్పేశాడు.
సృష్టికి
సుఖముష్టికి
అసంతుష్టి తనుయష్టికి
పాపిష్ఠికి
పరమేష్ఠికి
తగిలిందట

వికట భ్రూకుటీ ప్రకట
విరూపాక్ష రూక్షదృష్టి !
రగిలిందట
ప్రళయరౌద్ర రసహాసంతి !
పగిలిందట పరమాణువు !
పగిలిందట పరమాణువు !
అణువణువున వణకిందట
కుడియెడమల నడిమింటను
మృత్యుంజయు ముంజెకన్ను !
హాలాహల కోలాహల
మదిగదిగో !
అవి గవిగో !
వృషభధ్వజ భుజకీర్తుల
విషవాంతులు——
శివుని పదమె చీమకుట్టె
శివునికె సివమెత్తెను
తప్పటడుగు తాండవమై
థకిట థకిట తధిగిణతోం
లయపడ్డది
నవబ్రహ్మ నడ్డిమీద——
భయపడ్డది
భవతాండవ రవభైరవ
లయభ్రాంతమై లోకము
ఆ లోకాలోకార్థము
ఆకస్మిక వికస్వరత

నవధరించె నభవుని మూ
డవ నేత్రము—
ఎటుచూచిన నిటాలాక్షి
హుతాత్పటుచ్ఛటాచ్ఛటలు !
పటాపంచలై పోయెను !
పంచభూత సంచారము !
భూతావని భూతద్దను
భూతేశ్వర ప్రతిబింబ
ద్యోతకమై
పడె నివురై ఫాలాక్షుడు !
నివురు నివురు నిటాలాక్షి !
అని ఆరోజుల్లో అనుపద పల్లవితో ప్రళయలయ
లంపట ఝటితిస్ఫూర్తితో గీతాలాపం చేశాడు.
ఆటంబాంబులు హైడ్రోజను బాంబులు
పరీక్షనాళికలలో ప్రాణప్రతిష్ఠలూ,
రాబట్లు, రాడారు, రాకెట్లు
ఫ్లయింగు సాసర్లు, స్పుట్నిక్లూ
మొదలైన వాటన్నిటిగురించీ కలలు కనేశాడు,
జాంబవంతుని స్వప్నాలు !
అయితే అన్నిటిగురించీ ఆలాపనలు చెయ్యలేదు—
'గుండె గొంతుకలో కొట్లాడుతూ' వుండిపోయింది.

* * *

ఈనాడు మళ్ళా అంతరిక్షంలోకి
తన బుర్రని రాకెట్‌లా వదిలేసి
బుద్ధి భూతద్దంలోంచి

భూతకాల వైతరణిని దాటి
భూలోకం భవిష్యత్తుని
తనిఖీ చేస్తున్నాడు.

ఇటీవల అతను దేనిగురించి ఆలోచించినా జరగబోయేదంతా అతి స్పష్టంగా గోచరించేది. అంతర్ముఖత్వం వహించిన అతని మనస్సులో అన్ని సంగతులూ వరసగా—

త్రీడీ సినిమాలో ఫిల్మురీలు తిరిగినట్లు తిరిగేవి.

కాని యివాళ—

అసలే మసాబువేసిన మునిమాపువేళ
అడవిలో దూరంగా తాటితోపు మలుపుల్లో
బొమ్మచెముడు డొంకలను పెనవేసుకున్న
కోరింత జీబులు
గుడిసెల్లా కనిపించినట్లు
అంతా మసక మసకగా వుంది
భూలోకం భవిష్యత్తు అతని కళ్ళకి.
అతని ఆత్మాంతరాళంలోంచి చూస్తే
భూగోళం
కాస్త బల్లపరపుగా కనిపిస్తోంది

* * *

ఇప్పుడతనికి ముప్ఫయ్యేళ్ళు—ఇంక ముప్పైఛ.
అప్పటి కతనికి షష్టిపూర్తవుతుంది.
కాని పాపం కవేగాని సన్మానం కాదు
సరికదా రిటైరు అవుతాడు
ఉద్యోగంనుంచి కాదు
లోకంనుంచే !

* * *

1987 డిసెంబరు 31
రాత్రి పన్నెండు గంటలు.
తెల్లవారితే - ఆ
కాదు—
ఆ గంట గడిస్తే
1988 జనవరి ఫస్టు!
కాని తెల్లవారదు.
ఆ పన్నెండు గంటలు దాటి గడియారం,
చిన్నముల్లు సరేసరి,
పెద్దముల్లుకూడా
అరసెకండు అవతలకి జరగదు.
అంతే!
అప్పుడే అక్కడే
అంతర్వాణి శర్మ భావనాడి
తక్కున ఆగిపోయింది.
అది 1987 వ సంవత్సరానికే కాదు.
ఈ లోకానికే ఆఖరిరోజు!
మానవ కాలమానానికి ఫులిస్టాపు!
కాదు కాదు
ఆనాడు మానవుడు
మృత్యువును హత్యచేశాడు!
ఆనాడే లోకాంతరంలోకి మానవుని మహాప్రస్థానం
ఆనాటినుండే భూదేవికి మారు మనువు
అదిగో! ఆ 1987 డిసెంబరు 31 తేదీ అర్ధరాత్రే.
ఈ భూలోకం తీరంలోనే
సముద్రుడి బొడ్డులాగున్న ఆ దీవిలోనే.

ఆ బొడ్డుమీది పొటమరించిన పుండులాగున్న
ఆ కొండ మీదే
అటూ ఇటూ అణుశక్తి పరిశోధనాగారాలు
ఆ ఆవరణలోనే
ఆ భూలోకపు శ్మశానూలే
నలువైపులా
అస్థిపంజరాలూ,
కుహనా మానవ మస్తిష్కాలూ,
కృతక శిశు విశిష్టశోధన నాళికలూ
చిందర వందరగా పడివున్న
ఒక గదిలో
ఒంటరిగా ఒక సైంటిస్టు!
సృష్టి సంకల్పంతో సమాధిగతుడైన పరమేష్ఠిలా
ప్రాణాయామం పట్టిన మృత్యుంజయమూర్తిలా
వెలిగిపోతున్నాడు
అతని ముందు క్రమంగా దిగజారిపోతున్న దీప శిఖ
ఒక్కపరి అతని ఊపిరికి రెపరెపలాడి
ఉజ్జ్వలంగా ఒక జ్వాలగా లేచింది.
ఉన్నట్టుండి హఠాత్తుగా
ఏదో సాధించినవాడిలా లేచా డతను.
లేచి కట్టెదుటనున్న మంచుపెట్టె తలుపు తెరిచాడు.
తెరిచి దీర్ఘనిద్రాముద్రితమైన ప్రియురాలి ముఖంవైపు
తదేక దీక్షగా చూచాడు
చూచి సన్నగా నిలుకడగా వెలుగుతూ వున్న
దీపజ్వాలమీద ఏదో పొడిచల్లి పొగ అణగారేక
ఆవిర్భవించిన ఆవిరిని

ఆమె ముకుపుటాల ద్వారా ముమ్మారు
ఊపిరితిత్తులలోపలికి ఊదేడు.
క్రమక్రమంగా
ఆమె ఉచ్ఛ్వసించింది.
నిశ్వసించింది
దీపం రెపరెపలాడింది
ఆమె రెప్ప లల్లార్చింది
తెప్పరిల్లింది
కన్ను లరవిచ్చింది
ఆమె పాల బుగ్గలమీద నవ్వు పక్కుమంది
బుగ్గలు లొత్తలు పడ్డాయి
ఆ లొత్తల్లో నవజీవకళా లావణ్యపు లోతులు స్ఫురించాయి.
మగత వదలి మంత్రదేవత లేచినట్లు లేచింది
మృతిచెందిన ప్రియురాలు బ్రతికిందన్న సంతోషంతోటో
అసలు మృత్యువునే సాధించానన్న సంతోషంతోటో
ఆ రెండు సంతోషాల ఏకాంతపు మైకంతోటో
సరిగా అదేవేళకి ఆ ప్రక్కనుంచి రివ్వున వచ్చిన
అటామిక్ షాక్ తోటో

అతను ఉక్కిరిబిక్కి రయ్యాడు
బిక్కచచ్చిపోయాడు
చచ్చిపోయాడు
ఆమె బ్రతికిందికాని పాపం ?
అతను చచ్చిపోయాడు !
అతని ప్రాణజ్యోతి
ఆమె చూస్తూ వుండగానే
అణుశక్తి పరిశోధనాగారాభిముఖంగా

పయనించింది
అందులో ప్రవేశించింది
ఆ ఏ కాంతంలో
ఎవరినో ఆవేశించింది.
అంతే
మళ్లా మసక మసక
మరుక్షణంలో——
ఏదో మీటనొక్కిన సవ్వడి-
కర్ణకఠోరమూ, హృదయ నిర్భేదకమూ అయిన
ఒక భయంకర ధ్వని!
పరమాణు గర్భంలోంచి ప్రాదుర్భవించిన
ప్రళయార్భటి!
ప్రళయ కాలాభీల పర్జన్యగర్జ!
'యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బుచాటున ఖణేల్మన్నాయ్!'
భూగోళం అంతా రెండు చిప్పలుగా విడిపోయి
ఆ చిప్ప లొకదాన్నొకటి ఢీకొన్నాయి
ప్రళయ రుద్రుడి చండతాండవంకి
సృష్టి చేసి చేసి విసుగెత్తిన విరించనుడే
తాళం వేస్తున్నట్లుంది
అహో! కన్నులు మిరుమిట్లు గొల్పే
దుర్నిరీక్ష్య మహోజ్జ్వల తేజః స్ఫులింగాలు!
లయకాలుని అభయహస్త శుభముద్రలు!
కాదు కాదు అవి
చెచ్చెర సమాధిలోంచి లేచి
చెడామడా శివు డిచ్చిన చపేటాలు తిన్న

సిసృక్షా బుభుక్షవు బ్రహ్మదేవుడి దవడవాపులు !
అహో కుంభవృష్టి !
అహో ! ప్రళయ ఝంఝా ప్రభంజనస్వామి విజృంభము !
చెలియలికట్ట చెంగున లంఘించి
నిరవధికమై నీరనిర్భరమై
ఘూర్ణిల్లుతూవున్న
అర్ణవపు ప్రమిదలో
లయకారుడికి కాలపురుషుడు పెట్టిన
అఖండ దీపవర్తి
ప్రళయకాల కరాళబడబానలజ్వాలా గుళుచ్ఛం !
ఎటుచూసినా
పంచభూతాల ప్రళయావేశం !
విలయ దేవతా వికటాట్టహాసం !
ఉరుములు ! మెరుపులు !
పొగలు ! సెగలు !
ఆవిరులు ! కావిరులు !
ఏదో గుంభ్రని పదార్థం చూర్ణం చూర్ణమైపోయి
ఆ చూర్ణం ఆకాశాన్ని మలామాచేసింది
మళ్ళా మసక మసక——
అంతర్వాణి శర్మ గ్రుడ్లు మిటకరించాడు
చుట్టూ నిశితంగా పరిశీలించాడు
కనపడింది ఏమీలేదు
ఎక్కడా కించిత్ప్రాణి ప్రచారంలేదు ;
అంతా నిశ్చేతనం !
కనీసం ఒక బండలాంటి మూర్తపదార్థమన్నా
స్థూలంగా కనిపించలేదు !

అలవోకగా గలగలమను
ఒక సెలయేటి పారుదల పొలకువలేదు !
ఒక గాలిరివట వీచిన జాడలేదు !
ఒక కాంతిరేఖ ప్రసరించినవైనం కానరాదు !
ఆకారం - కాంతి - శబ్దం అంతా మిధ్య !
అంతా గాఢాంధకార బంధురం ?
నిశ్శబ్ద నీరవం !
అస లింత భూగోళమంతా ఏమైపోయింది !
దాని గోళాకృతి అంచులగొగ్గులైనా కనిపించవేం !
సర్వంసహ సర్వనాశనమైపోయింది !
సైంటిస్టు చిల్లంగి పెట్టేశాడు !
అతను మృత్యువును సాధించడానికి ముందే
పరమాణువును ఛేదించాడు !
ప్రళయ రహస్యం కనుగొన్నాడు
అంతులేని అశాంతితో బాధపడే
భూప్రపంచాని కింక శాశ్వతమైన శాంతి !

* * *

అదిగో మళ్లా
ఏదో ఎర్రనిగోళం
గిర్రున తిరుగుతూవుంది
జేవురించిన శాంభవాంబకంలా
అదే తిరుగుతూవుందో !
అంతర్వాణి శర్మ నేత్రగోళాలే తిరుగుతున్నాయో !
ఆ గోళం గాజు బెజ్జాల్లోంచి
ఏవో రెండు చిన్నగోళాలు
ఒక మానవుడి నేత్రాల్లా వున్నాయి

శూన్యంలోకి చూస్తున్నట్లున్నాడు
ఏమిటా గోళం?
అది భూగోళమేనా?
కాదు కాదు
అది ఆ వేళ
పరమాణుశక్తి ప్రకోప పరమావధిని
పరీక్షించిన సైంటిస్టు
తన ప్రాణ రక్షణకోసం
శూన్యం ప్రాకారంలో గిరిగీసి నిర్మించుకొన్న
ఏకాంత హార్మ్యం!
అమాంతం లోకాంతకమైన
అణుశక్తి గర్భిణ్యరిష్టం!
భూతజగత్తు జగత్తంతా భగభగమండి
భస్మీభూతమై పోయింది!
ఎంపైరుస్టేటు బిల్డింగ్సు పేకమేడల్లా పడిపోయాయి!
ఎవరెస్టులు కరిగి నీరై ఆవిరులై పోయాయి!
కాని ఏకాంత హార్మ్యం మాత్రం
చెక్కుచెదరలేదు
అందులో
భీతావహ భూతావిష్టుడై
అర్ధరాత్రి
సౌప్తికపర్వం నిర్వహించిన అశ్వత్థామలా
ప్రళయకాల విశ్వ విశ్వంభరాదేవి
గర్భస్రావ జీవసార నిర్భర మహాప్రవాహంలో
వటపత్రశాయిలా
క్షుద్ర జగద్భస్మావలేపనాభీల

ముద్రాయితమూర్తి ప్రళయరుద్రుడిలా
పరమాణుశాస్త్రి !
ఒక్కసారి లోకంమీద తన అక్కసంతా తీర్చుకున్నాడు
కాదు కాదు పాపం, ఎందుకేనా మంచిదని అలాంటి
ఏకాంత హర్మ్యం నిర్మించుకున్నాడుగాని ముందుగా-
ఇంతముప్పు మూడుతుందన్నమాట
అతని ఊహకే అందలేదేమో——
పాపం పాపగాడికి ప్రయోగం తెలిసింది కాని
ఉపసంహారం తెలీలేదు.
తెలీకేం ! లోకోపసంహారం !

*  *  *

మంటలూ చప్పుళ్ళూ
క్రమక్రమంగా
ఉపశమిల్లుతున్నాయి.
అణుశాస్త్రి పరిస్థితి గమనించాడు.
అతని కిప్పు డేం చెయ్యడానికీ తోచలేదు.
బయటికి రావడమా ?
చచ్చి ఏంచెయ్యాలి ?
అని తటపటాయిస్తున్నాడు.

*  *  *

ఇంతలో సమీపంలో
కొనవూపిరితోవున్న భూదేవత
మూలిగినట్లు
సన్నగా ఒక చిన్న సవ్వడి.
అణుశాస్త్రి నలువంకలా కలయజూచేడు.
సమీపంలో ఒకమూల

ముచ్చముడిగి మూలుగుతున్న ఒక స్త్రీమూర్తి !
తాను మినహా ఎక్కడా
ఒక్క సప్రాణ పరమాణువు
కనిపించని వేళ
ఎవరామనిషి !
బహుశా బలవన్మరణం పాలైన
భూలోకం ఎత్తిన పిశాచావతారమా !
ఆ లోకోత్తరసౌందర్యం చూస్తే
ఆమె పిశాచియనిపించదు
ఆమె కాస్తకదిలింది, మెదిలింది
మైకం వదిలింది.
కళ్ళుతెరిచి తేరపారజూచింది.
వణుకుతూ, తడబడుతూ
ఎలాగో గొంతు సవరించుకుని
'ఎవరునువ్వు పిశాచివా ?'
అని గొణిగేశా డణుశాస్త్రి.
ఆమె బల్లనానుకుని లేచింది.
ముందుకో అడుగువేసింది.
అణుశాస్త్రికి ముఖాముఖిగా నిల్చుంది—
"నీకు నిజంగా పిశాచాన్ని చూడాలనివుంటే
అదిగో ఆ అద్దంలోకి చూసుకో !
నే నెవరినా ? ...అహ్హా...హ్హా !...
నీ ప్రియురాలిని—
మృత్యువును.
మృత్యుంజయుని ముద్దుచెమ్మను
ఆఁ ! నే నింకా బతికేవున్నానా !

అవును నేనెందుకు బతికివుండను !

నేనే మృత్యువును

నాకు చావేమిటి !

'అయినా నిన్ను చంపకుండా చస్తానా !'

అని మొలలోంచి చిన్న పిస్తోలు తీసింది.

అణుశాస్త్రి గజగజ వణికిపోతున్నాడు.

అతనికి పరిస్థితి ఏమీ అర్థంకాకుండావుంది.

గాభరాపడిపోతున్నాడు.

'ఎవరునువ్వు ? ఎలావచ్చావిక్కడికి ?'

అని యింకా ఏదో అనబోతున్నాడు.

'ఒక్కక్షణం ఆలస్యమైపోయింది !

లేకపోతే ఆమీట నొక్కేదాకా

నిన్నుండనిచ్చేదాన్నా ?

నేను చచ్చిపోయాననుకున్నా

నువ్వూ చచ్చిపోయావనుకున్నా'

అణుశాస్త్రి తాను నిజంగా చచ్చిపోయి మరేదో లోకంలో ఎవరితోనో మాట్లాడుతున్నానేమో అనుకున్నాడు.

ఎదురుగావున్న అద్దంలోకి ఎగాదిగా చూసుకున్నాడు.

ఓసారి గట్టిగా ఒళ్ళు తడుముకున్నాడు.

ధైర్యం కాస్త చిక్కబట్టుకున్నాడు. కాని

'నేనేం చేశాను !...నేనేం చేశాను' అని నీళ్ళు నములుతున్నాడు.

'ఛీ ఘాతుకుడా ! కాదు కాదు నిన్నలా పిలవడానికి ఆ మాటకి అర్థం చాలదు. ఒక సజీవలోకానికి లోకాన్ని దుంపనాశనంచేశావు. ప్రకృతి సవిత్రినుండి నీకు కావలసినంతా విజ్ఞాన స్తన్యం గుంజుకొని తల్లి రొమ్మే గ్రుద్దేవు. ఆమె ప్రాణా లాపోశనం పట్టేవు.'

'ఇంతలా జరుగుతుందని నేననుకోలేదు'

'అనుకొని వుండకపోతే ఇంత గట్టి లోకాంతకమైన ఏకాంత హర్మ్యం ఎందుకు నిర్మించుకున్నావు ?' ఆమె గద్దరించింది.

'ఎందుకేనా మంచిదని. అయినా అనంత బ్రహ్మాండకోటిలో ఎంత ప్రయత్నించినా ఎప్పటికీ సుఖసమగ్రం కాని అశాంతిమయమైన యీ భూగ్రహం ఒక్కటీ నశిస్తేనేం ?'

అప్పుడే కొంచెం తెగించి శాస్త్రవాదం మొదలెట్టేడు.

'అంతగా ఈలోకపు టశాంతి నీ హృదయంలో సానుభూతిని ప్రకోపింపజేస్తే, నిజంగా ఆ అశాంతిని చూడలేని దయాళుడివైతే ఆత్మ హత్య చేసుకోవలసింది నువ్వు. అంతేకాని లోకాన్నంతా ధ్వంసం చేయ డానికి నీకేం హక్కుంది ?'

'లోకంలో అందరికీ పిల్లలను కనడానికి యోగ్యత వుందా ? యోగ్యత లేకపోయినా పిల్లలను కనడానికి వాళ్ళకా హక్కెవరిచ్చారు ? పిల్లలు తమని కనమని తలిదండ్రులకు దరఖాస్తుపెట్టేరా ?'

'ఆలోచిస్తే ఆత్మహత్యవినా మానవుడికి ఏ హక్కూలేదు. అదొ క్కటే అతని జన్మహక్కు. ఎవరూ తమ హక్కుగదా అని పుట్టరు, పుట్టించరు. తలిదండ్రులు మాత్రం పిల్లలను పుట్టమని బతిమాలేరా ? బలవంతంచేశారా ? ఆ పిల్లలు సహజమైన సృష్టికర్మలో యాదృచ్ఛికంగా సంభవించే ఫలితాలు. చావు పుట్టుకలు సర్వప్రాణికోటికి స్వాభావికాలు.'

'పుట్టుకవున్నదానికి చావు తప్పదుగదా ! మరి...'

'ఎంత చచ్చుమాటన్నావు ! నేనసలు చచ్చినదాన్నే ఇప్పుడే మళ్ళా బ్రతికాను. నువ్వు పరమాణుశక్తి పరిశోధకాగ్రేసరుడివి. గొప్ప సైం టిస్టువి. కాని మావంటి పామరుల హృదయాలకు తట్టే వూహలు నీ మెదడుకి తట్టవు. తట్టినా పట్టించుకోరు మీరు నువ్వు తలుచుకొంటే లోకాన్నంతా ఏకధాటిగా నాశనం చేసెయ్యగలవు. చేశావుకూడా. కావలిస్తే చావకుండా వుండగలవు. చచ్చినవాళ్లను బతికించడానిక్కూడా ప్రయత్నం చెయ్యగలవు. సృష్టిలోని యాదృచ్ఛిక సంభవాలను అరికట్టగలవు. కాని నీయంతట నువ్వు స్వతంత్రంగా ఒక్క చిన్న క్రిమిని సృష్టించగలవా ?.

అణుశాస్త్రి కాస్సేపు మౌనం వహించి ఆలోచనలో పడ్డా అతనిలో ఏదో కుతూహలం చెలరేగుతూ వుంది.

'ఏమిటీ! నువ్వు చచ్చిబతికినదానివా? మా మిత్రుడు ఏడమ్ము ప్రేయసి ఇవనోవావా నువ్వు!'

'అవును. పరమాణుశక్తి పరిశోధనాభినివేశంలో పరవశుడివై పోయిన పరమశివుడివి నీకు వెంటనే గుర్తెలా వస్తుంది!

చిత్రం! ఇద్దరూ ఇక్కడే ప్రక్క ప్రక్కలనే పరస్పర విరుద్ధాలూ, అత్యంత విశిష్టాలూ అయిన రెండు అపూర్వ విజ్ఞానశాస్త్ర ప్రక్రియల్లో పరిశోధన ప్రారంభించారు. అతనిది ప్రవృత్తిమార్గం. నీది నివృత్తిమార్గం! పాపం అతను నన్నెంత గాఢంగా ప్రేమించాదో గాని, చచ్చిపోయిన నా కోసం తన ప్రాణసారం ధారపోసి బతికించాడు. ఈకాలపు సైంటిస్టులు తమ కేవో ప్రత్యేకం యిలాంటి వ్యక్తిగత సమస్యలుంటేనే కాని అందరికీ పనికివచ్చే సంగతుల గురించి ఆలోచించరేమో!

ఏమైతేనేం ఆయన మృత్యువును జయించాడు, నన్ను బ్రతికించాడు. కాని మృత్యువు తన రహస్యం లోకాని కంతటికీ తెలియకూడదని కాబోలు అతన్నే బలికోరింది.

ఆయన చచ్చిపోయినా మృత్యుంజయుడే. జగత్తంతా చచ్చి నువ్వొక్కడివే మిగిలివున్నా జీవన్మృతుడివి నువ్వు. మానవుడు మృత్యువును జయించిన మరుక్షణంలో ప్రపంచానికే ప్రళయం వస్తుందని నువ్వు అనుకోకుండా రుజువుచేశావు. బహుశా కారణం మానవుడు పుట్టుక గుట్టుగూర్చి ఎరుక సంపాదించడానికి ముందే చావును సాధించడానికి పూనుకోవడం, మృత్యువును జయించడానికి ముందే ప్రపంచాన్నంతా ప్రళయంలో ముంచెత్త గల శక్తిని సంపాదించి వుండడమే అనుకుంటాను. ఈ దృష్టితో చూస్తే మృత్యువును సాధించడంలో నీదే ముందంజ అని చెప్పాలి!'

'ఒక్కమాట. సృష్ట్యాదినుండి మానవుడు ప్రకృతిరహస్యం తెలుసుకోవాలని నిరంతరం ప్రయత్నిస్తూనే వున్నాడు. ఆ ప్రకృతితత్వంయొక్క

గాంభీర్యం, వైచిత్రి, రామణీయకం చూసి భయవిస్మయానందాలు పొందేడు మానవుడు. ఆ అనుభూతులనుంచే అతని మనస్స్వరూపం క్రమా విష్కృతమైంది. భగవంతుడు జగత్తును సృష్టించడం కాదు ఆ ప్రాక్తన మానవుడి ప్రకృతి గంభీరతత్వ ప్రభూతాలైన భయభ్రాంతులే భగవంతుడిని సృష్టించాయి. ఆనాటి అతని ఆనందమే కవిత్వంగా పరిణమించి నానాభూత కల్పనలతో సృష్టిరహస్యపరిజ్ఞానం మరింత క్లిష్ట సమస్య అయిపోయింది.

అతని విస్మయాకులతే తర్కసహమైన తత్వమీమాంసకు ప్రస్తావన అయింది. తరతరాల దేశదేశాల తాత్వికు లెందరో ఎన్నో తర్జనభర్జనలు చేశారు. దృశ్యమాన పదార్థ ప్రపంచ యధార్థస్వరూపంగురించి ఆయా విజ్ఞాన శాస్త్రవేత్త లెందరో మహత్తర పరిశోధనలు జరిపారు. ఎవరూ సృష్టిరహస్యం ఇదమిత్థమని తేల్చలేక పోయారు. అది ఎవరికీ అంతు పట్టలేదు.'

'నువ్వు తేల్చావుగా ఇప్పుడు. ఇప్పటి కంతుపట్టిందిగా.'

'ఇదంతా తగుమనుషులు చాలామంది తత్వమీమాంసకు లన్నట్లు ఈశ్వరసృష్టే అయితే, ఆయన ఎలా వూడిపడ్డాడని నేను ప్రశ్నించి లాభం లేదు గనక ఆ ప్రశ్న అడగనుకాని, మరి ఆయన తన సృష్టి అంతా ఇలాగ ఒక మానవమాత్రుడిచేత నాశమై పోతూవుంటే చూస్తూ వూరుకుంటాడేం? అతనే వుంటే నాశనం కావటం అతనికీ యిష్టమేనేమో! నేను నిమిత్త మాత్రుడిని.'

ఆమె కేమి జవాబు చెప్పడానికీ తోచలేదు. క్షణంసేపు మౌనం వహించింది.

'ఇదేనా నీ మరణ వాజ్మూలం! ఇదిగో ఈశ్వర సంకల్పం నెర వేర్చి చూపిస్తాను' అంటూ పిస్తోలుతీసి,

'ఎప్పటికీ ముక్కోటిసంఖ్య పెరగకుండా, తరగకుండా వుండడానికి మనం దేవతలం కాము. నష్టసుఖాలూ, మంచీచెడ్డా, చావూపుట్టుకా ఇంకా అవీయివీ గల మానవులం. మన లోకానికొక పరిమితి ఉంది. ఏ సైంటిస్టూ

ఆ పరిమితిని పెంచలేను. మనకి పుట్టుకమాత్రమే వుండి చావు లేకపోతే మన ఉనికికి ఎన్ని లోకాలన్నా చాలవు. నువ్వన్నట్లు పుట్టుకవున్నదానికి చావుతప్పదుగదూ మరి. నేను ఒకసారి చచ్చి బతికిందాన్ని, మళ్ళా ఇప్పుడు చావగలనో లేనో తెలీదుకాని నిన్ను చంపగలను. తప్పకుండా చస్తావు నువ్వు. చంపేస్తా' అని హుంకరించింది.

ఇంతలో ఏదో పెద్ద చప్పుడు.

పెద్ద చప్పుడే గాని శ్రవఃపేయంగా వుంది.

అల్లంతదూరాన అభిముఖంగా

ప్రచండ వేగంతో పయనిస్తూ

కన్నులు మిరుమిట్లుగొల్పే ఒక కాంతిచక్రం

క్షణంలో అణుశాస్త్రిహర్మ్యం వాకిటే దిగింది.

ఇద్దరూ ఖంగారుపడ్డారు.

చక్రాకారంలోనుంచి గుడ్లు మిటకరిస్తున్న గోళాకారాలు కొన్ని అవతరిస్తున్నాయి.

ఆ గోళాకారాలు పొడవుగా దొన్నెలాగున్న తమ కాళ్ళూ చేతులూ అణుశాస్త్రి హర్మ్యంవేపు జాపుతున్నాయి.

దాని గోడల నానుకున్నాయి.

ఎవరూ తలుపు తెరవకుండానే లోపల ప్రవేశించాయి.

ఆమె నిశ్చేష్ట అయినా నిర్భయంగా ఆ వింతను గమనిస్తోంది.

అణుశాస్త్రి వొణికిపోతున్నాడు.

'భయపడకండి. మేము మీ సోదరులమే. కిన్నరులం. కుజగ్రహ వాస్తవ్యులం. గంధర్వనగరంలో ఏదో ఉత్సవం జరుగుతూ వుంటే వెళ్ళాం. ఇంతలో భూగోళంలో ఏదో ప్రళయం సంభవించిందని మాకు తెలిసింది. ఇప్పుడక్కడనుండే మీ లోకా న్నొకసారి పరామర్శిద్దామని బయల్దేరి వస్తున్నాం' అని ఆ వచ్చిన గోళాల్లో ఒక పెద్దగోళం మాట్లాడటం మొదలు పెట్టింది.

'చాలా కాలంబట్టి మిమ్మల్ని మేం పరిశీలిస్తూనే వున్నాం. దఫ దఫాల మా చక్రవాహనాలతో మీ లోకంమీద విహరించాం. వింత వింత యంత్రాలద్వారా ఎప్పటి కప్పుడు మీ నడతలు కనిపెడుతూనే వున్నాం. అయితే యింత మూడిన తరవాతగాని ఇక్కడికి రావడం పడలేదు. మీరూ గ్రహాంతరప్రయాణాలకి ప్రయత్నించారు. కాని మీ గ్రహచారం మరోలా మారింది.

ఏమి టలా తెల్లబోయి చూస్తారు. మా వాలకం వింతగా వుందనా? అవును మాకు పనిచేసే ఉపకరణాలు కాళ్ళూ చేతులూ, ఆలోచించే బుర్ర మాత్రమే వున్నాయి. కడుపులేదు. మాబుర్ర లింతింత వుండడానికి కారణం ఒక పెద్ద మెదడు, ఆ పెద్ద మెదడు పక్కనే ఒక విశాల హృదయమూ అమర్చబడి వున్నాయి. మేము మీతో అస లీకువలయంనుంచే విడిపోయి చాలా కాలమైంది. అప్పటినుంచీ మీలాగే అనేక విషయాల్లో పరిశోధనలు చేశాం. చేస్తున్నాం. బాహిరమైన ఏ విషయంగురించి ఎంత పరిశోధన చేస్తున్నా ఎప్పటికప్పుడే అంతరంగ శోధనకూడా చేసుకుంటూ వుంటాం. కాబట్టి అసలు మేము మీకు అనుజులమే అయినా సాధించిన అభివృద్ధి విషయంలో మాత్రం అగ్రజులమనే చెప్పాలి. ఇదంతా స్వోత్కర్ష అనుకో కండి. యధార్థాన్ని ఉద్ఘాటించడం మాత్రమే మా ఉద్దేశం.

మా ఎరుకనూ, అనుభవాన్నీ పురస్కరించుకొని మేమే కోరి కొన్ని సలహా లివ్వదలిచాం మీకు. ఇంత మూడిందిగదా అని — మీరు పాటించినా పాటించక పోయినా — క్షమించండి మా మాటలుగాని కటువుగా వుంటే.

నైతికబలంలేని వట్టి పోరంబోకు నాగరికత మీది. ఆత్మవిశ్వాసమూ అపార నైతికబలమూ, సత్యనిష్ఠాగల నాగరికత మాది. మీరు బతుకు చివరి భాగమైన చావును సాధించడానికి చూస్తారుగాని ముందుగా దాని కుదురు పట్టయిన పుట్టుక గుట్టు తెలుసుకోవడానికి ప్రయత్నించరు.

అహంకార మమకారావేశాభినివేశాలతో మీ జీవయాత్ర ముగుస్తోంది. సృష్ట్యాది మూలసూత్ర రహస్యజిజ్ఞాస మా ఊపిరి. ఇచ్ఛాశక్తి సాధన మా జీవితం. అదేదో ఇంతదాకా మాకూ అంతుపట్టకపోయినా అద్భుత ఫలితాల నిచ్చింది. మాకు ఆ జ్ఞానసాధన, శక్తిసాధన తప్ప మరి సమస్యలు లేవు. మేము ఏది ఆలోచించినా, పనిచేసినా మెదడుతోపాటే హృదయాన్నిగూడా వినియోగిస్తాం.

మీలో కొందరు ఈశ్వరు డెక్కడో ఉన్నాడనుకుంటారు. అసలు కొందరు లేనేలేడంటారు. మేమంతా ఏకగ్రీవంగా ఈశ్వరుడు మాలోనే వున్నా డనుకొంటాం. అలా గనుకొనేవాళ్లు మీలోనూ కొద్దిమంది వున్నారు లెండి కాని ఒక్క ముఖ్యమైన సద్భావంలోనైనా లోకంలో వున్నవాళ్ళంతా ఏకీభవించకపోతే లాభంలేదు. అలాంటి ఏకీభావం ఏ వొక్క విషయంలోనూ, ఏ కాలంలోనూ మీలో కుదరలేదు.

కోరికలకోసం మీరు దేవుణ్ణి ధ్యానిస్తారు.

దేవత్వం పొందాలన్న దొక్కటే మా కోరిక.

మీ ఊహకీ, చేష్టకీ, అనుభవానికీ చాలా తేడాలుంటాయి.

మా కన్నిట్లోనూ ఏకవాక్యత వుంటుంది.

మీకు ఆకలి వేస్తుంటే తినాలని బుద్ధి పుడుతుంది. మాకు తినాలని సరదా పుట్టినప్పుడే ఆకలి వేస్తుంది. ఈ మాటలు మీకు వింతగా కనిపిస్తాయి. అర్థంకావు. మీబుద్ధి చాలా పరిమితమైనది. అది యీ మాటల అర్థం ఊహించలేదు. మేం చెప్పినా మీకిప్పు డప్పుడే బోధపడదు.

వాలములూడి వానరులే నరులైనారని విన్నాం. తోకలూడినా మీకా గుణాలు మాత్రం పూర్తిగా పోయినట్లు లేదు. కొన్ని విషయాల్లో కోతులుకూడ మీకన్నా చాలా నయమనిపిస్తాయి. వాటిలో ఎంత చక్కని సంఘీభావం ఏర్పడివుందని! మీరు గమనించారో లేదో కాని తోటి జీవి ఒక్కడు కాస్త కస్తిపడుతూ వున్నట్టు అవికాని గుర్తించడం తటస్థిస్తే పాపం ఎంతగానో విలవిలలాడిపోతాయి. కక్షలతోటీ, కావేషాలతోటీ ఒకరి

నౌకరు నరుక్కోడానికి కూడా వెనుకాడరు మీ మానవులు. ఒక జాతికి చెందిన జంతువులు కూడా మీలాగ తమని తాము చంపుకోడం ఎరగం. అధవా అలాంటిదేమన్నా జరిగివున్నా మీ మానవుల్లో కొందరిలాగ రాక్షసులు కూడా తమ జాతి మాంసం తాము తినివుండరు. ఆమధ్య అంటే నేటికి సరిగా ముప్పైఏళ్ల క్రితం 1957 సం. నవంబరు ప్రాంతంలో మీలోకం లోకమంతా అతి నాగరికదేశం అని అనుకొనే ఒక గొప్పదేశంలో ఒక పెద్ద విశ్వవిద్యాలయంవున్న పట్టణంలో నరమాంస భక్షకు లుండేవారని విన్నాం. ఇంకా ఎన్నెన్ని అఘాయిత్యాలు చేశారని మీ మానవులు!

మీ లోకం సుఖసమగ్రం కావటానికి అవకాశాలు తక్కువే. కాని అవకాశాలన్నవి కొన్ని అసలే లేకపోలేదు. ఉన్నంతలో వాటిని సద్వినియోగం చేసుకోలేకపోయారు. దానికి కారణం మీలో చాలా మందిలో గూడుకట్టుకొనివున్న స్వార్థం, ఆశ, అసహనం, అసంతృప్తి, సుఖానుభూతికి నాగరికతతో నిమిత్తంలేదు. కొత్తగా సౌకర్యాలు పరిశోధనచేసి కనిపెట్ట నవసరంలేదు. సంతృప్తి వుంటే శాంతి, సౌఖ్యం అన్నీ వున్నట్టే. మీకన్నీ సమస్యలే. అందులో అనేకం మీరు కోరితెచ్చిపెట్టుకొన్నవే. మీ మానవ సంఘమంతా దురత్యయాలైన ఆర్థిక సూత్రాలపై అంధ విశ్వాసాలపై, జాతిమత భాషాదిక బహుళ వైవిధ్యంపై ఆధారపడివుంది. మీ లోకంలో చాలామందికి ప్రపంచ పరిణామం, జీవిత వైఖరుల గురించి ఆలోచించే శక్తిలేదు. శక్తివున్న వాళ్ళకి ఆ అలవాటులేదు. అందులోనూ ఈ యిరవయ్యో శతాబ్దిలో మరీ మితిమీరిపోయింది మీ లోకం. ఏ విషయంలోనూ మీ జీవితాల్లో ఒక నియతీ, విలువ, విశ్వాసం, ప్రమాణంలేకుండాపోయాయి.

ఇంకా ఏమని చెప్పను! ఎంతని చెప్పను మీ లోకం వింతలగురించి! ఇంతకి అణుశాస్త్రీ, ఈ లోకం లోకమంతటినీ ఒక్క మాటతో చేతిమీదుగా చక్కబెట్టిన అసాధ్యుడివి నీకు మేం చెప్పేదేముంది! పాపం నువ్వూ ఏదో సదుద్దేశంతోటే యీ పుణ్యం కట్టుకున్నానంటావు కాబోలు! పోనీలే ఇదీ ఒకందుకు మంచికే వచ్చిందేమో! అనేకవిధాల అశాంతిమయమైన లోకానికి

ఎప్పటికీ ఓ గత్యంతరం కనిపించక అది నీ బాధ్యతే అనుకున్నట్లుగా ఒక పరిష్కార మార్గం చూపించావు. అయితే ఆ మీట నొక్కడంతో నీ పరిష్కార ప్రక్రియతంతు సాంతమైపోయిం దనుకోకు. ఒక నవ్యమార్గంలో పునస్సృష్టి సంకల్పించు.

నువ్వు మహామేధావివి. ఈమె లోకోత్తర సౌందర్యవతి-ఈ నవ్య సృష్టి మహాయాగంలో మీ ఉభయులూ ప్రధాన భాగస్వాములయితే ఒక అఖండ మేధావి, పరమశాంతుడు, ధీరోదాత్తుడు, అనుత్తమ మనస్వి, మహాతేజస్వి అయిన పుత్రుడు పుడతాడు. ఇది మా ఆశయం. శాస్త్రీయమైన విశ్వాసం. మాకు అనుభూత పూర్వమైన విషయం. అతని అవతారం భూలోకానికి మరో సరిక్రొత్త, మహోజ్జ్వలమైన, అన్వర్థ మన్వంతరం—. కాగలదు

కావలిస్తే మా లోకంతో మీరు రాకపోక లేర్పరచుకోవచ్చు. సంబంధబాంధవ్యాలు కూడా పెట్టుకోవచ్చు. ఆ నవమనువుకి ప్రియమైన వధువును మాలోకంనుండి తీసుకువస్తాం. ఒక క్రొత్తలోకం, క్రొత్తజాతి, అంతా సరిక్రొత్త అయిన ఒక ఉదాత్త వ్యవస్థ ప్రసాదిస్తాం. ఇతర లోకాలతో రాకపోకలు, ఇతోధిక బాంధవ్యాలూ ఏర్పరచుకొని అందరం కలిసి కట్టుగా దేవత్వం సాధిద్దాం. ఈ మహోద్యమంలో మేమూ హృదయ పూర్వకంగా మీతో సహకరించగలమని హామీ యిస్తున్నాం. ఇదే మీ ఉభయులకీ మా ఆహ్వానం. మా లోకం ఎంత మధురంగా, ప్రశాంతంగా, ఉల్లాసంగా ఉంటుందో స్వయంగా చూద్దురుగాని, ఒకసారి దయచెయ్యండి. అక్కడే ఆత్మసాక్షికంగా మీ వివాహం అతి వైభవోపేతంగా జరిపిస్తాం. సిద్ధచారణ గంధర్వ విద్యాధరాదులంతా అతిథులుగా వచ్చి శుభాశీస్సులిస్తారు. పదండి' అని గోళస్వామి ఉపన్యాసం ముగించాడు.

ఇవనోవా, అణుశాస్త్రి—ఇద్దరూ ఒకరి ముఖా లొకరు చూచుకున్నారు. ఇవనోవా సిగ్గులో పరమాణుశాస్త్రి చిరునవ్వునిగ్గు ప్రతిఫలించింది. ఇద్దరి హృదయాలూ పరస్పరం పలకరించుకుని స్పందించాయి.

ఇద్దరూ హృదయపూర్వకంగా కుజగ్రహ వాస్తవ్యుల ననుసరించి చక్రవాహనారోహణం చేశారు.

చక్రవాహనం గంధర్వ నగరం మీదుగా పయనిస్తూ అంతర్థానమైంది.

ఆవేళ భూలోకం ఖాళీ అయిపోయింది పూర్తిగా. ఒక మహా మన్వంతరం గడిచింది.

అనంతర యుగభావనలో అంతర్వాణి శర్మకు మగత పట్టింది. మగతలోనూ ఏవో మంచి మంచి కలలే కన్నాడు, కలకల నవ్వేడు, కలవరించాడు. పలపల తెల్లవారింది. పంచాంగం మారింది. ప్రపంచం మారుగాక !

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

(భారతి - జనవరి, 1958)



# అభిప్రాయములు

★

ఆచార్య విద్వాన్ శ్రీ గంటి జోగి సోమయాజి
ఆంధ్ర భాషాశాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు.

చిరంజీవి డాక్టరు జోగారావు స్వీయ ప్రతిభవల్ల రూపెత్తిన పంచకల్యాణిపై భావ ప్రపంచములలో విహరించుచున్నాడు. సునిశితమైన తన అనుభవముతో భావ ప్రధానమైన పదజాలముతో ప్రాత క్రొత్త నడకల సొగసులతో ఈ రచన సాగించియున్నాడు. ప్రాచీన మహాకవుల ప్రధాన విధానములను తన మనసులో జీర్ణించుకొని నవ్యకవుల నవనవ రీతులలో ప్రస్తుత ప్రపంచ పరిస్థితి, జీవన విధానము మొదలైనవాని నన్నిటిని పాఠకుల మనస్సులలో చురుకుగా ప్రవేశించునట్లు వ్రాసియున్నాడు. సహజమైన ప్రతిభ, ప్రయాసపడి సంపాదించిన వ్యుత్పత్తి, అలవరచుకొన్న అభ్యాసము కలిసి ఈ పంచకళ్యాణిపై విహరించుట కీతనికి మిక్కిలిగా నుపకరించినవి.

సంగీత సాహిత్య ప్రియులైన రాజుగారి కిట్టి తేజీని కానుకగా నొసంగుట మిక్కిలి యుచితము. వారే దానిని భరించగలిగిన సమర్థులు.

ఈ ఉచ్చైశ్శ్రవముపై మరియొక విధముగా అప్రాప్యమైన భావలోకములలో నితడు విహరించి నూత్నానుభూతిని భావి పఠితలకు వివరించి కవి ప్రపంచములో శాశ్వతమైన యశస్సు సంపాదించగలడని యాశీర్వదించుచున్నాను. ఇతి శివమ్.

ఆచార్య శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

వర్ధిష్ణువు చిరంజీవి జోగారావు 'పంచకల్యాణి' ఆంధ్రవాఙ్మయ శృంగాటకంలో లౌకికాలౌకికానుభూతి గీతిక లాలపించి వచ్చిన అభినవ మధురవాణి. ఏ యజ్ఞాత దివ్యలోకమునుండియో చిత్రవిచిత్ర భావస్ఫురణాభిరామమై ప్రౌఢ పద బంధురమై, అనర్గళధారా రుచిరోజ్జ్వల ప్రాకృతిక శోభా సముదీర్ణమై రంగాని కవతరించిన భవ్య 'అవతార'మే ఒక మహోదయ పర్వము.

....మొత్తంమీద 'పంచకల్యాణి' పంచకల్యాణియే. ముందుముందు ఈ కృతికర్త ఇంకా గొప్ప సాహిత్యసేవ చేసి సత్కృతులు వెలయించి–వట్టి యస్వి కాదు–యశస్వి కావలెనని ఆశీరక్షతలు చల్లుచున్నాను.

గౌ. డాక్టర్ జస్టిస్ శ్రీ పి. వి. రాజమన్నారు

డాక్టర్ ఎస్. వి. జోగారావుగారి ఖండకావ్య సంపుటము 'పంచకల్యాణి' హైదరాబాదు ఆంధ్ర రచయితల సంఘమువారి ఆదరాభిమానములతో విజయ దశమినాడు ప్రకటింపబడునని విని సంతసించితిని. ఆవిష్కరణ సందర్భములో ఆ కృతి నా పురాణ మిత్రసత్తములు శ్రీ రామకృష్ణరాజు గారికి సమర్పింపబడునని వినినంత నా సంతోషము రెండింతలాయెను. కృతికన్య ముక్కుపచ్చలారని ముద్దుగుమ్మ. నవ్య విలాసాంచితయైన బంగరుబొమ్మ. కృతిభర్త రసికావతంసు డైన నాయకోత్తముడు. ఇట్టి ప్రశంసనీయమైన కన్యాదాన మహోత్సవ సమయ మున నా శుభాశీస్సులను పంపుతున్నాను. ఆవిష్కరణ జయప్రదముగా జరుగు ననుట నిస్సంశయము. విజయీభవ.

ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం హైదరాబాదు
ఆంధ్ర శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వ విద్యాలయము

డాక్టరు జోగారావుగారి రచనా విశేషములలో 'ఊహా ప్రహేళిక' యను నూతన ప్రక్రియ ప్రశంశనీయమై యున్నది. ప్రవల్హిక, ప్రహేళిక అను పదములు గూఢముగా నుంచబడిన యర్థముగల కావ్య విశేషమును తెల్పును. జోగారావుగారి ప్రహేళికలు 'అవతారము' 'మన్వంతరము' అనునవి గూఢార్థములను స్పష్టము చేయు రచనారీతులు. ప్రకృతిశాస్త్ర విజ్ఞానమునకును కావ్య ప్రపంచమునకును చుక్కెదురని కొంతకాలము వరకు భావింపబడెడిది. భౌతికశాస్త్ర రహస్యములను గూడ కావ్య వీధిలోనికి గొనిరావచ్చునని ఆరంభమున నిరూపించినవారు శ్రీ వసంత రావు వెంకట్రావుగారు. శాస్త్ర విషయములను వీరు పద్యరూపముగను గేయ రూపముగను వ్రాయుట కారంభించిరి. శాస్త్రమును కావ్యము చేయుటలో ఇది మొదటి మెట్టు. శ్రీ జోగారావుగారు ఇంతటితో తృప్తిపడక శాస్త్ర కంకాళమునందు భావనానీత రక్త మేదో మాంసాదుల నింపి దానినొక సుందరరూపముగా తీర్చిదిద్ది అచ్చపుశిల్పి యనిపించుకొన్నారు. శాస్త్ర పరిశోధనల నితివృత్తముగా గ్రహించి, శాస్త్రజ్ఞులనే నాయికానాయకులుగా చేసి, అద్భుత రసము ప్రధానరసముగను, లలిత శృంగారము అంగరసముగను సమకూర్చి, గద్య పద్య గేయరీతుల కిమ్మీరిత సమ్మిశ్రణముగ సృష్టించి 'ఊహా ప్రహేళిక' యను క్రొత్త కావ్య ప్రక్రియను రూపొందించిన కవిగారు నిక్కపు పురోహితులు. వీరు తర్కపురుషుని భావనా

సుందరినిగూర్చి పరిణయమొనర్చి బ్రహ్మముడులు వేయించిరి. ఇది క్రొత్తపంథ యగుటచే దీని సౌందర్యమును తత్త్వమును ఆకళించుకొనుటకు కొంతకాలము పట్టవచ్చును. ఇట్టి రచనలను వీరింకను కొన్నిటిని చేసి స్ఫుటరేఖలలో నమర్చినచో ఉత్తరోత్తర కవికుమారులు శాస్త్రమును కవిత్వమును నీరక్షీర న్యాయమున సమ్మిశ్రితము చేసి ఆస్వాదనీయముగా చేయగలరని యూహింతును.

'అవతారము' అను ఊహాప్రహేళికయందు మానవుడు సృష్టిలో మొట్టమొదటిమాటు అడుగుపెట్టు సుందర సన్నివేశమును కవిగారు చక్కగా అంతస్సన్నిధి గావించుకొని, అనురూప వాతావరణమును సృష్టించి, పరిణామ సిద్ధాంతమును కావ్యసూత్ర నిబద్ధము చేసిరి. ఆదిమానవుడు తన ప్రియురాలైన సహచరి కోసము పలవించుటయందే కవిత్వ మారంభమైనదని తోపించుటకు గాబోలు ఈ ఘట్టమున వీరు లయబద్ధమైన గేయమును వ్రాసినారు.

'మన్వంతరము' అను ప్రహేళిక అణువిచ్ఛేదమునకును తదనుసంభవమైన విశ్వ ప్రళయమునకును కావ్యత్వమును ప్రసాదించిన అద్భుత రౌద్ర శృంగారముల రమ్య సమ్మేళనము. తిక్కన సోమయాజి ఇట్టి దృశ్యములను చారుభీషణములని వర్ణించును. మానవమేధ ఈశ్వరసృష్టి విధ్వంసమునకు తోడ్పడినంతగా స్వయంసృష్టిచేసి జీవమునకు అమరత్వము కల్పించుటలో ఇంకను కృతకృత్యము కాలేదని కవిగారి యాశయముగా తోచుచున్నది.

డాక్టర్ కె. వి. ఆర్. నరసింహము

నీ కలం పంచకళ్యాణి ;
నీ కవిత నిత్యకళ్యాణి ;
పొగలెగసే, రవలుమిసే,
తారాల్, రసగుళికలు, నీ మాటలు ;
హిమాలయం శిఖరాలు,
పాతాళం పునాదులు,
సముద్రాలు, సరిత్తులు,
అడవులు, కొండలు, లోయలు,
రాగంతో, రంగుల్తో
తాజాగా కనిపిస్తాయ్ ;
చక్కిలిగింతలు నవ్వులు,

చిక్కని పాటలు పదాలు,
నిషాచేసి కుషీనిచ్చి
మురిపిస్తాయ్ మరిపిస్తాయ్ ;
నీ కలం పంచకళ్యాణి ;
నీ కవిత నిత్యకళ్యాణి ;

శ్రీ అనంతపంతుల రామలింగస్వామి

చిరంజీవి యస్. వి. జోగారావు వర్తమాన కవిలోకమున వర్ధమాన మహావీరుడు. వ్యుత్పన్న యువకవి. ఉత్సాహ సంకలితుడు. ఉన్నతాదర్శ దర్శకుడు. కళాకలనా కోవిదుడు.

పూర్వ కవులయం దీతని కపార గౌరవము. ఆధునికులయం దనూనాదరము, కావున నీతని కవన ముభయకవిసమ్మతము.

కవితారీతి ప్రాచ్య పాశ్చాత్య సారస్వతాశయ సమ్మిళితము. శైలి, శిల్పము, ధ్వని రసిక ప్రశంసనీయములు.

ఈత( డేకవివర్గమునకుం జెందియుండక యొక ప్రత్యేక కవివర్గ స్థాపకుడగునని నా విశ్వాసము.

ఈ యువకవికి నా హృదయపూర్వ కాశీర్వచనములు.

విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రి

....ప్రాచీన మార్గముల గౌరవించుచు క్రొత్త త్రోవలకు మోజువడుట పిన్ననాటనుండి జోగారావు తత్త్వము. అనుకరణముల నభిలషింపడు. ఉపజ్ఞ కుబలాట పడును. రచనము నూతనము—బాణీ కొత్తది.

జోగారావును గూర్చి ఒక్కటే నా ఆశాసనము :

సారస్వతరసికానా ముపజ్ఞావతాం కవి యువకానాం సమానానా ముత్తమ శ్లోకో అస్తు.

డాక్టర్ ఓరుగంటి రామచంద్రయ్య

ఈ కావ్యములోని 'అవతారము'ను జోగారావు చదివిన విశాఖ సభకధ్యక్షత నాకు లభించియుండినది. నాడు ఈ కృతిభర్త శ్రీ రామకృష్ణరాజుగా

రక్కడ ఉండుటయు తటస్థించినది. నాటి నా మాటలనే మరల అందును—'అది కవిత్వమా! తత్త్వమా ! కవిత్వ తత్త్వమే అది-సద్యః పరనిర్వృతి.' తత్సాధనా మార్గమున సుదూరగామి చిరంజీవి జోగారావున కివే నా సహృదయాశీస్సులు.

*ఉభయభాషా ప్రవీణ*
కొమ్మనమంచి జోగయ్యశర్మ

....ఈ రచన ప్రాచీన సంప్రదాయబద్ధమా, నవీన మార్గానుగతమా అను జిజ్ఞాసలతో కాలయాపన సేయక సహృదయులగు పాఠకులు కదుష్ణ భావసంప న్నములైన యిందలి కళాఖండములను ప్రీతిమై నాస్వదింతురు గాక. మిత్రమణి శ్రీ యస్వీ జోగారావుగా రింకను నవనవ ప్రతిభతో రసవత్తరములగు కృతులను సంతరించి ఆంధ్రశారద నారాధింతురు గాక.

శ్రీ కాళోజీ నారాయణరావు

ప్రస్తుత పంచకళ్యాణి పరుగులుతీసిన విధానంచూస్తే 'సవారు' గట్టివాడనే తోస్తుంది ఆ సవారు యస్వీ జోగారావు—ఉరపు యశస్వి భోగారావు.

అందమైన అనుభవాల బాట
యశస్వి భోగారావు పాట
చక్కని సమన్వయవాది మన జోగారావు.

ఆదిమానవుని అవతారముతో ప్రారంభమై మానవుడు అందుకొన్న స్థాయిని చూపిస్తూ అందుకోవలసిన స్థాయిని సూచిస్తూ మన్వంతరంతో ముగిసిన యీ పంచకల్యాణి పరుగుల్లో మొదటిది తుదిది రెండును సరిక్రొత్త సాహిత్య ప్రక్రియా ప్రయోగములు. ఊహా ప్రహేళికలో ఆకాశమును తనలో ఇమిడించుకొనుటకు ఆలోచన చేసిన ప్రయత్నం కనబడుతుంది.

*

కవిసమ్రాట్

విశ్వనాథ సత్యనారాయణ

శ్రీ డాక్టరు యస్వీ జోగారావుగారు రచించిన 'పంచ కల్యాణి' అన్న కావ్య సంపుటిని చూచితిని. గ్రంథకర్త గారు ఆంధ్ర విశ్వవిద్యాలయములోఁ బండితులు. పరిశోధన చేసినవారు. మంచి భావుకులు. వీరి కలము పూర్వాధుని కములయిన రెండు సంప్రదాయమార్గములలోను నిరాఘాట ముగ నడచినది. వీరి కవితాశక్తి ప్రశంసనీయముగ నున్నది. ఎక్కువభాగము వీరి అభిరుచి యాధునిక కవుల మార్గమునందె యున్నట్లు తోచును. కాని పద్య రచన పూర్వకవి మార్గమునందు మేలిమి తెలిసినవారిదిగాని యితరముకాదు. మరియు నీనాడు ప్రసిద్ధులయిన కొందఱు కవుల రచనలయందు వీరికిఁగల యభిమానము వీరి కొన్ని పద్యచరణ పద్య రచనలయందు కనిపించుచున్నది.

వీరు విమర్శకులు పరిశోధకులేగాక చక్కని కవులు కూడ నగుట ప్రశంసనీయము. వీరికిఁ బరమేశ్వరుఁడు ఇతోధిక రచనయం దవకాశములు కలిగించి యాంధ్ర సరస్వతీవికాసము కలిగించుగాతమని ప్రార్థించుచున్నాను.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧ | ౨౧ | నిదానము | నిధానము |
| ౭ | ౧౪ | సాయంత్ర | సాయంకాల |
| ౭ | ౧౬ | వారములు | వాసరములు |
| ౧౭ | ౫ | భక్త | భక్తి |
| ౧౭ | ౧౮ | నాళికేర | నారికేర |
| ౨౪ | ౧౯ | -షమున్ | -షమ్మున్ |
| ౩౩ | ౬ | యెంచిన | యెంతిన |
| ౩౮ | ౬ | -శ్బిత | -శ్చిత |
| ౪౮ | ౧ | ప్రేమ పాశపు | ప్రేమ పేశపు |
| ౫౧ | ౫ | కిమిదం | కిమతః |
| ౬౪ | ౧౨ | బ్రకుకులో | బ్రతుకులో |
| ౭౯ | ౨౦ | ఆరతేరిన | ఆరితేరిన |
| ౮౧ | ౪ | అద్దమ | అద్దమ |
| ౮౩ | ౧౧ | ఉస్నూరు | ఉస్సురు |
| ౮౪ | ౧౦ | బండారం | బడారం |
| ౯౦ | ౧౨ | లేదు ; లేదిక | లేదు ; లేదులేదిక |
| ౯౯ | ౧౨ | ప్రధాస్పద | ప్రథాస్పద |



డాక్టర్ యస్వీ
ఎమ్. ఏ., పిహెచ్. డి.

జననం 2-10-1928 పార్వతీపురంలో. తల్లి సరస్వతి వాగ్గేయకారిణి. తండ్రి సాంబశివరాయకవి. చిన్ననాట పెదతండ్రి శ్రీ కలియుగంగారి కడ కవితా వ్యాసంగం. 1949-52 సం. లలో ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఆంధ్ర శాఖలో విద్యాభ్యాసం. 1952 లో ఆనర్సులో ప్రథమ శ్రేణిలో ప్రథముడుగా ఉత్తీర్ణత. తదుపరి ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో 'గవర్నమెంట్ ఆఫ్ ఇండియా సీనియర్ రిసెర్చి స్కాలరు'గా వాఙ్మయ పరిశోధన, డాక్టరు పట్టస్వీకారం. ప్రకృతం ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఆంధ్ర శాఖలో ఉపాధ్యాయ వృత్తిలో ప్రవృత్తి.

రచనలు : ఈ పంచ కల్యాణి (కావ్య సంపుటి). యక్షగాన వాఙ్మయ చరిత్ర (డాక్టరేట్ థీసిస్. కేంద్ర ప్రభుత్వ ధనసాహాయ్యముతో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ప్రకటించ నున్నది). చోమోలుంగ్మా (నవల). 'మదన కామేశ్వరి' (నాటికల సంపుటి). సువర్ణ శృంఖల. మన్వంతరం (కథలు, గల్పికలు, ఊహా ప్రహేళికలు) — తెలుగులో ఈ 'ఊహా ప్రహేళిక' అనే నూత్న ప్రక్రియ ఈతని చేతి అపూర్వ సృష్టి. ఇంకా వివిధ సాహిత్య విషయాలపై అముద్రిత వాఙ్మయంపై విమర్శలు, పరిశోధనాత్మక వ్యాసాలు పలు పత్రికలలో ప్రకటితములు.